ఓం

శ్రీరస్తు

శ్రీ గురుభ్యోన్నమః

# అంతరార్థరామాయణము

## వేదాంతానుభవగ్రంథము

వచనరూపము

ఇది

చోడవరం కా॥ బ్రహ్మశ్రీ కూరెళ్ల నరసింహాంపంతులు గారి ధర్మపత్ని సౌ॥ శ్రీమతి కూరెళ్ల కామేశ్వరమ్మగారిచే రచింపబడి పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురంతా॥ పాలకొల్లు కా॥ బ్ర॥ శ్రీ ఫుల్క ఉమామహేశ్వరశాస్త్రి (వైయాకరణకేసరీ ధర్మోపన్యాసకేసరీ) గారిచే పరిశోధించబడి సాలూరు కా॥ బ్ర॥ శ్రీ కాచీభట్లకృష్ణరాయశాస్త్రి (ఆంధ్రగీర్వాణభాషాప్రవీణులు, వేదాంతజ్ఞులు) మహాకవిగారిచే పరిష్కరింపబడి మ॥రా॥రా॥ శ్రీ ఉప్పల బంగారయ్యశ్రేష్టి, బి. ఏ., బి. యల్. హైకోర్టువకీలుగారి గొప్పధనసహాయముచే విశాఖపట్టణం శ్రీ శారదాముకుట ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి, ప్రకటింపబడియె.

మొదటిముద్రణ.

500 కాపీలు.

 [వెల రు **0-12-0**

# విచికిత్స

ఈకావ్యము వేదవాచ్య రామాయణ పరిభవమై యుం టదంటలగువారుతక్క నెక్కరణిని మధించి మధుర మధుర రామాయణాంతర్గుప్త పరమామృత రామామృతమును నాస్వాదింప నెవ్వరును నసమర్థులే. అట్లగుట నందలి రమ్య పారమ్యమును సౌమ్య మొనరింప నసాధారణ మేధావులు నధ్యాత్మ రామాయణ మనియును, నానంద రామాయణ మనియును ననేక విధముల తాత్త్వికరహస్యముల సంయోజించి సమగ్ర రచన గావింప లేకపోయిరని సహృదయులకు సుబోధమే. ఆ లోపము తీరునట్లు భగవత్కరుణా విశేషమున పరమ సాధ్వీ ముఖమున పామరులకుంగూడ గరతలామలకమగు చొప్పున నాతి కఠిన భాషామయముగ శిష్ట భాషా విశిష్టముగ రచితమగునట్లు నేడు కనుగొంటిమి.

ఆయమ్మ పరమభాగవత చరణసేవా పరాయణ పరమాణువనునైన నేను మాచిన్న అక్కయ్య అని పిలువదగిన సులువగు చుట్టరికము పెంపుగలదిగదా? అని కుతూహలం పడకమానను. ఇక గావ్య విషయమున ననుభవైక మానాద్వైత పరమ వైదాంతిక జ్ఞాన సూక్తములను వాల్మీకి కోకిల ముఖమున కోకిల కాకలీ కలకల పంచమస్వరంబుననే కాక పరిణవ

స్వరంబున ప్రతిధ్వనింపజేసిన యాకౌశలము మెచ్చదగినదని పాఠకు లనక మానరని విశ్వసింతును.

ఇట్లు,

మహాకవి కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి,

ఆర్షవిద్యాలయము,

సాలూరు.

—[o]—

ఓమ్.

శ్లో॥ సర్వచైతన్య రూపాంతా మాద్యాం విద్యాంచధీమహి।
బుద్ధిం యానః ప్రచోదయాత్॥

బ్రహ్మశ్రీ వేదమూర్తులగు కూరెళ్ల నరసింహాంపంతు లువారి భార్య మ॥సా॥ శ్రీ కామేశ్వరమ్మగారు నేను సనాతన ధర్మ ప్రబోధనమునకుగా నీచోడవరమువచ్చి యుండగా తమచే రచియింపబడిన యానన్తరార్థ రామాయణము లేకదత్త్వాను భవ రామాయణమను నాంధ్ర భాషామయ గద్యగ్రంథము బరిశోధించుటకు గాను భక్తితో నాకొసంగిరి.

ఈగ్రంథము నామూల చూడముగ పరిశోధించి చూచితిని. ఈగ్రంథమున శ్రీరామాయణ కథనంతేను అధ్యాత్మతత్త్వమునకు జక్కని యనుభవముతో సమన్వయించి తమకు గల యాధ్యాత్మిక తత్త్వానుభవము నంతను ముముక్షువులగు స్త్రీరత్నములకు సుబోధముగ శ్రీజగన్మోహిని నురుల కమృతమునువలె బంచి యిచ్చిరి.

ఇంతియగాక శ్రీనీలకంఠ దీక్షితాది పురాణేతిహాసాది వ్యాఖ్యాతృ చూడామణులు స్వీయవారి వంశాది వ్యాఖ్యానములలో శ్రీ వేదవ్యాసాది మునివరులు పురాణేతిహాసాది గ్రంథములను రచియించుటలోను యుగాన్తర కల్పాన్తరాది స్త్రీపురుషుల కథలను వెల్లడించుటలోను కేవలకథా

మాత్ర ప్రకాశన తాత్పర్యము కాక సకల పురుషార్థ ఫలభూ
తంబగు మోక్షమహాపురుషార్థమును మందమధ్యమాధికారుల
కందజేయు తలంపుతో దత్సాధనమగు తత్త్వవిచారము సు
బోధముగ సిద్ధించుటకై దృష్టాన్తములనుగ నాయా కథలను వి
షయ నిగరణముతో సమకూర్చిరనియు నందులకుగాను దేవత
ల కథలను శమదమాది కథాపరములనుగాను రాక్షసాది కథల
ను గామక్రోధాది కథాపరములనుగాను సమన్వయించు కొనవ
లెనను ముఖ్యసూత్రమును వెల్లడించి యట్లు సమన్వయించి ని
రూపించిరి.

దానింబట్టి యార్షములగు శ్రీ రామాయణ మహా
భారత భాగవతాది గ్రంథములు ముఖ్యముగా బ్రహ్మతత్త్వ
ప్రబోధమునకును బ్రహ్మ తత్త్వవిచారాధికార ప్రాపకమగు
ధర్మ తత్త్వప్రబోధమునకును మాత్రమే రచియింపంబడి యుం
డుటంగని ప్రకృతి పురుషులగు శ్రీసీతారాముల చరితమునంత
ను మందాధికారులకొరకుగా నీమె యాసంప్రదాయమునను స
రించి యధ్యాత్మ తత్త్వపరముగ నన్వయించి యీగ్రంథ రూ
పమున బోధించిరి. కనుకనే యీమె యీగ్రంథమున మంద
స్త్రీ వ్యావహారిక భాషనే యుపయోగించిరని యెంచెదను. అం
దుచే గ్రాంథిక భాషాభిమానులుకూడ గవితా సామ్రాజ్య ప
ట్టభద్రులగు సుప్రసిద్ధ విద్వత్కవులే గ్రామ్యభాషనే యుప
యోగించుచున్న యీరోజులలో నిట భాషాసౌష్టవ పరీక్షకు
లుకాక విషయ గ్రహణమాత్ర లాలసులగుట యవసరము.

ఇట్టివే రామాయణకధలోవచ్చు స్త్రీపురుషుల బోల్చు టలోగొన్నికొన్ని చోటులలో దత్త్వవిమర్శకులకు గొన్ని భేద ములగుపడినను వానిసిగుణగ్రాహులు సరకు సేయరనియే యెం చెదను. ఈసాధ్వీమతల్లిక జన్మాంతరీయ పుణ్యపరిపాకమున జ నించిన సద్వాసనా ప్రాబల్యమున జిరుతప్రాయము నుండియు గార్గి మైత్రేయ మున్నగు సతీమ తల్లులవలె నైహిక భోగలం పటత్వమును వీడిమోక్ష సామ్రాజ్య శాశ్వతానందమును బడ యగోరి విరక్తయయ్యు శాస్త్రీయ మార్గమున నన్వర్థగృహిణీ నామధేయయై గృహధర్మముల నెరవేర్చును.

విశ్రాంతికాలమున వేదాన్తగ్రంధముల బఠించుచు వి జ్ఞులగు విబుధు లేతెంచినపుడు గురుభావమున వారి నాదరించు చు వారివలన వేదాన్తశ్రవణము జేయుచు స్వీయసంశయము లను నివారించుకొనుచు శృతాంశములను మననము జేయుచు నిధిధ్యాసనముననుండి తనకు దెలసిన యంశములను దనసన్నిధి కేతెంచిన కులకాన్తల కుపదేశించుచు క్రమముగ శ్రీసరస్వ తీ నిలయమనుపేర దత్త్వప్రబోధనాలయము నేర్పర్చి స్త్రీలకం దరకు దత్త్వప్రబోధన మొనర్చుచు స్వజీవితమును ధన్యము గావించుచున్నయది.

ఇటగొప్ప విశేషణము మాత్రము కలదు. ఆధునిక నాగరకమ్మన్య స్త్రీలవలె గలిప్రభావమున బాశ్చాత్యవేషభా షా చారములకలవడి ముగ్ధలై పాశ్చాత్య స్త్రీ తాదాత్మ్యము నొందగోరుచు స్వకుల స్త్రీధర్మముల గూల్చికొని స్వైరముగ

జరించుచు స్వైరచారమున కుపయోగించునను భ్రాంతిచే త
త్త్వ విచారమునకు గడంగినట్లు కడంగ నీయక గులస్త్రీ ధర్మ
ముల నుద్బోధించి యాచరింప జేయుచు గులస్త్రీ వేషభాషా
చారధర్మముల కాదర్శినులనుగ దమశిష్యవర్గమును దయారు
జేయుచు నాముష్మిక సుఖసాధక మార్గముల నుద్బోధించుచు
న్న యీసతీ తిలకమునకు నేను మనసార వన్దన సహస్రము
ల నర్పించకుండ నుండలేను.

ఇట్టి ఈసాధ్వీమణిచే రచియించబడిన ఈగ్రంధము మొ
త్తముమీద దత్త్వసమన్వయ మార్గమును సమంజసముగ ని
రూపించుచు స్త్రీలకేగాక బురాణ సమన్వయ సంప్రదాయము
ల నెరుంగక చిట్టికథల ప్రాచుర్యముతో గథలనుమాత్రమె
ట్టులో బ్రవచించుచు పామరలను మోహింపజేసికాలక్షేపము
నర్పుచున్న యాధునిక పౌరాణిక లోకమునకుగూడ దత్త్వస
మన్వయ మార్గప్రదర్శకమగు చున్నదని నేను దృఢముగ వ
క్కాణింపగలను. ఇట్టి ఈగ్రంథము నీనిలయము నీనిలయాధీ
శ్వరీయగు గ్రంధకర్త్రియు నభ్యుదయ నిశ్శ్రేయసములతో
నుండునట్లు లాసర్వాన్తర్యామి యనుగ్రహించి రక్షించుగాత.

ఇతి శివమ్

ఇట్లు:—వుల్య ఉమా మహేశ్వరశాస్త్రి వైయాకరణ
కేసరి- ధర్మోపన్యాస కేసరీ.

హాల్ మకాం చోడవరము,<br>
శ్రీసరస్వతీ నిలయము,<br>
విశాఖపట్నంజిల్లా.

శ్రీ ధాతృనామసం॥ర ఆషాఢ<br>
శుద్ధసప్తమీ శుక్రవాసరము,<br>
ది 26_6_1936 సంవత్సరము.

ఓం

శుభమస్తు.

శ్రీగణేశ శారదా గురుభ్యోనమః.

# అంతరార్ధ రామాయణము

## బాలకాండము.

"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణంచతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే॥"

"నమోస్తు రామాయ సశక్తికాయ నీలోత్పల
శ్యామల కోమలాయ కిరీట హారాంగదభూ
షణాయ సింహాసనస్థాయమహాప్రభాయ."

"ఓంనమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో
వంశఋషిభ్యో నమోమహద్భ్యోనమోగురుభ్యః."

## అంతరార్ధ రామాయణమున ప్రథమ సాధనము
## బాలకాండము.

కశ్యపబ్రహ్మ (పశ్యతీతి, కశ్యపః) రామాయణము యొక్క ఆద్యంతములవరకు చూచిన వ్యాపింపబడిన ఒక మహావ్యక్తియేయని తెలియఁబడును. అనగా విషయవాసనలనే రాక్షసులొనరించు బాధల కోర్వలేక వ్యాపింపబడిన మహావ్యక్తియనికూడ కశ్యపునకు అన్వయము. అతనియొక్క భార్య అదితి (అఖండనీయా ఇత్యర్థః) అనియున్నది. కశ్యపుని అనుసరణముగా తిరుగునదిగావున అదితియని చెప్పబడినది. ఈవుభయులుతపమొనర్చిరి.

అపుడు ఉత్కృష్ట గతియను విష్ణువు ప్రసన్నమై వారితో నిట్లనుడి వెను. (రమయతీతి రామః) "రమించుటయను క్రియగల రాముడను నామముతో మీవుభయులకు జన్మించెద" అని నుడివి అంతర్వాణియందు లయించెను. అపుడు కశ్యప బ్రహ్మ దశేంద్రియములు అను దశరథములుగలవాడై దేహమను అయోధ్యయందు (అయోధ్యా=శ్లో॥ దేవానాం పూరయోధ్యః దేవానాం=సాత్వికాది ప్రవృత్తీనాం) పరిపాలనకర్త అయి దశరధుడనే పేరుతో అవతరించెను. అదితి కుశలతబుద్ధియను కౌసల్య నామముతో వుద్భవించెను. (కౌసల్యా=కుశలతా+ఏవ=కౌసల్యా- శ, స, యోరభేదత్వాత్ కౌసల్య) ఈఉభయులు దాంపత్యమొందిరి. ఆదశరధునియొద్ద శిష్టాచారమను వశిష్ఠుడు (వశిష్ఠః=వశీ+సన్+తిష్టతి ఇతివశిష్ఠః వశిత్వం=శిష్ఠాచారాధీనత్వం) అనగా శిష్ఠాచారములు తెలుపుటయను గురుత్వము చేయుచుండెను. ఇట్లుండ ఒకనాడు జ్ఞానపుత్రహీనతకు వగజెంది (అనగా ఇక్కడ పుత్రశబ్దమునకు జ్ఞానము అర్థము) శిష్టాచారమను వశిష్ఠుని ఆశ్రయించి తన మనోరథమును వెలిబుచ్చెను. అంత నావశిష్ఠుడు జీవుడనే దశరధునితో ఇట్లుచెప్ప ప్రారంభించెను. "హేరాజా! పుత్రకామేష్టియను నొక యాగంబు కావింపుము. అందుకు పరికరములు గావలయును. గాన నీకు శాంతఅనే పుత్రిక వకతె గలదు. (శాంతా=శమాదివిశిష్టా ఇత్యర్థః) ఆయమకు కృషియను 'ఋష్యశృంగుని గూర్పుము'

వానివలన యాగసమాప్తి కాగలదు. అప్పుడు పరిపూర్ణానందమునుసర్వహృదయాంతర్యామిత్వంబును, సోహంసోహం అను యిరువదొక్క వేయి ఆరువందల పర్యాయములు తిరుగు హంసను తనయందణంచుకొని దానియందు రమించుచుండు అఖండా ద్వితీయః పరిపూర్ణ చైతన్యమే రాముడను నామముతో నవతరించును" అని నుడివిన ఆవాక్యములువిని జీవుడనే దశరథుడు యాగ సామగ్రిలను నొనగూర్చెను. పిమ్మట యాగము నారంభించెను. అపుడు హృద్వేదికయందుండు హంసయను యగ్ని ప్రజ్వలించి సోహమను పాత్రితో స్వరూపమను రామ తేజమునందుంచి జీవుడను దశరథునకు కుశలత బుద్ధియను స్వభావముగల కౌసల్యయను నొకభార్యయును సుమిత్ర (సుష్టుమిత్రేతి) యను నొకభార్యయయును (మైత్రిత, ముదిత కరుణ అనునవి గలది సుమిత్ర) కైక (కా+ఏకా ఇతి ప్రశ్నాత్మికా=జీవునకువిలాసకారిణియగు మూలప్రకృతి) యను నొకభార్యయు, ముప్వురు భార్యలు గలరు. యీముగ్గురు సతీమణులకు పూర్ణపాయస పాత్రిమును అందించిరి. వారు దయారసముతో యిచ్చిన ఆపాయసమును ఇరుతెగలుగా జేసిరి. విద్యా, అవిద్యా అను రెండుభాగములొనర్చి విద్యయను భాగము కుశలతయను కౌసల్య పుచ్చుకొనెను. అవిద్యా భాగము మూలప్రకృతియను కైక పుచ్చుకొనెను. శాస్త్రిను సారముగా కౌసల్యకు యిచ్చిన భాగములో సగము సుమిత్ర కిచ్చెను. కైక భాగములోకూ

డ అర్ధే సగము సుమిత్రికిచ్చెను. పాయసాన్నాను సారముగా ముగ్గురు యోగగర్భము ధరించిరి. నవవిధ భక్తులను నవమా సములు నిండిన తర్వాత ముగ్గురు మొత్తంగా నలుగురు బిడ్డల ను గనిరి.

అంత సత్యానందమగ్నులై శిష్టాచారమను వసిష్ఠుని తో పామరులు వీరిరూపము జూడలేరు. గాన వీరలకు నామ ము లొసర్పుడని* యాదశరథుడు ప్రార్థించెను. అందుకు జీ వుడనే దశరథుని అభిప్రాయానుసారముగా ఆబాలురకు నామ ములొసర్చెను. సమిష్ట్యుపాధిచే సర్వభూతములయందు రమిం చు విద్యోపాధి రాముడనియును విద్యయందుండు మంచిస్వభావ మే లక్ష్మణుడనియును తదుపరి అవిద్యాభాగమునకు జనించిన యిరువురకును యిరునామము లిడిరి.

అందు వకటిభరణాత్ భరతుడనియును,శత్రుహంతారం శత్రుఘ్నుడనియును అనగా గుణములుండి భరించుట అను క్రి యగలవాడు గావున భరతుడనియును ఆగుణములను నిరోధిం చుటయను శక్తిగలవాడు గావున శత్రుఘ్నుడనియును చెప్పబ డెను. అందుచే వీరిరువురు మూలప్రకృతియగు కైకయొక్క అంశ సంభూతులు. ఇందులో విచారణకర్తయను సుమిత్రికు ఇద్దరు బాలురు జనించిరని చెప్పవచ్చును. ఏలననగా అవిద్యా అంశము విచారణలోనిదే. అట్లుగా వేదార్థమను వసిష్ఠునిచే

యానలువురకు ఈనామము లుంచబడినవి. వేదార్థమన్నను శిష్టాచారమన్నను నొక్కటియే.

అందు సర్వభూతములయందు రమించుటయను సమిష్ట్యుపాధి అను రాముడున్ను అందు జనించు మంచిగుణములే లక్ష్మణుడనియును ఈయిరువురు దేవయానమను మార్గమునబట్టి బోవుచుండెరి. గుణములను భరించుట అట్లుగానే నిరోధించుటయను భరత శత్రుఘ్నులను యిరువురు బాహ్యకర్మల నాచరించుట అను పితృయానమనే మార్గమునబట్టి పోవుచుండిరి. ఇట్లు యీబాలురు తలిదండ్రులకు కోర్కెలదీర కర్మజ్ఞాన సముచ్చయములగు కొన్ని లీలలొనర్చిరి. పిమ్మట విశ్వమునకు మిత్రులయినవారు పెద్దలు గావున విశ్వామిత్రులవారు (విశ్వస్యమిత్రం=విశ్వామిత్రః) అచ్చటకు విచ్చేసిరి.

సర్వభూతములయందు రమించు రాముని గోరుటకై జీవుడను దశరథునివంకజూచి "నీయందు జనించిన మంచి స్వభావమనే రాముని నాకర్పింపుము. పిమ్మట దుష్టగుణములనే రాక్షసులను సంహారింప జేసెదను. ఇట్టి రాముని సహాయముచే జనన మరణము లొందెడు విషయములవంక దిప్పెడు రాక్షసులనుమ్రించి నిర్విషయమను వపనుదీసి అపుడు జనన మరణ రాహిత్యమనే సుఖము నొందగలను. గాన రాముని ననుపుమని వేడెను". అందులకు అజీవుడనే దశరథుడు మిక్కిలి చింతాక్రాం

తుడై యేనాటికో జనించిన మంచి స్వభావమనే రాముని ఈ గురువున కిచ్చుటెట్లు? మాటిమాటికి జనించు ఈదుష్ట స్వభావములు చచ్చుటెట్లు? అని విచారించి గురువునకు ఆగ్రహము రాకుండా వేదార్థమనే వశిష్ఠునితో ఇట్లుగా బలికెను.

"కాలమంతయు విషయములలో గడపి ఎప్పుడో వకప్పుడు జనించిన ఈమంచి స్వభావమనే రాముని ఇతనికిచ్చి నేను బ్రతుకుటఎట్లు? జీవించియున్నను వృధాగదాయనిచింతించెను" అప్పుడు శిష్టాచారమను వశిష్ఠుడు (వేదార్థమను గురువు) వచ్చి జీవుడనే దశరథునితో నీవట్లు చింతింపకుము. గురువనే విశ్వామిత్రునకునీమంచి గుణమనే రామునిచ్చినన్ గాని చెడుగుణములనే రాక్షసులను సంహరించుటెట్లు? వారు చచ్చినన్ గాని జనన మరణ రాహిత్యమనే యోగము పూర్తికానేరదు.

ఈగురువనే విశ్వామిత్రుడు సంతోషించినన్ గాని నీకు చేకూరు సుఖములు గల్గుటెట్లు? సర్వభూతాంతర్యామి యగు అఖండ చైతన్యం నీయందు జనించిన మంచిగుణమనే [స్వభావము] రాముడుగాన నేనియ్యను నేనిచ్చెదను అనుకర్తృత్వమేనీకు లేదు. అని శిష్టాచారమను వశిష్ఠు నుడివిన జీవుడనే దశరథుడు ఆమాటల కచ్చెరువొంది ఆహా! అట్టి చైతన్యమా ఈరాముడు అని హాశ్చర్యమొంది ఆరాముడనే నేను అనగా "ఆత్మా వై పుత్రనామాసి" అని శృత్యుక్తంగదా! ఆత్మ

నందమయ మగ్నమానసుడై ఆత్మారాముని విశ్వామిత్రున కొసంగెను.

బాహ్యాపాణమనే లక్ష్మణుడున్ను వెంటనేగెను. అంతవారలకు విశ్వామిత్రుడు బల అతిబల అనే (నిత్యానిత్య వివేకజ్ఞానం) మంత్రము లుపదేశించెను. ఇవి ఆకలి దప్పులులేని మంత్రములు. ఈమంత్రములుపదేశమయిన వెంటనే అనాది వాసనయను అజ్ఞానమనే తాటకి అచ్చటికి వచ్చెను. (తాటకాః=అనాదివాసనాభిః తాడ్యతె ఇతితాడకాః తటాక, తడాక ఇతివత్ తాటకా) విజ్ఞానమనే వొక్క బాణముతో దానిని సంహారించెను. పిమ్మట ఇరువురను వెంటదోడ్చుకుని ఆగురువనే విశ్వామిత్రుడు భూమధ్యస్థానమనే యజ్ఞవాటికకు జేరెను.

జనన మరణ రాహిత్యమనే యాగము నారంభించగా శల్యములు రుధిరము వర్షము కురిపించుచు అనగా దేహాభ్రమను దృఢము చేయుచుండే దుర్వాసనలనే రాక్షసులు అచ్చటకు వచ్చిరి. అంతర్లక్ష్యము బాహ్యలక్షణము అను రామలక్ష్మణులు యిరువురు కలసి మారీచ సుబాహులపై బాణములు వేసిరి. అనగా కర్మేంద్రియ వాసనయగు సుబాహుని ఖండించి జ్ఞానేంద్రియ వాసనయను మారీచుని పతిదూరముగ విసరివేసిరి. అంతట యాగము పరిసమాప్తినొందెను. శ్రవణ మనసా

ములనే మూడు దినములు అచ్చటగడపి గౌణమనే గౌతమాశ్రమమునకు చేరి అచ్చట అహల్యను గాంచిరి.

గౌతమునియొక్క భార్య అహల్యయని చెప్పుట అర్థములలో గౌణార్థము ముఖ్యార్థము అని రెండుగలవు. గౌణార్థమనగా వూహచే అన్వయించునది. ముఖ్యార్థమనగా అనుభవనీయముగా తెలియునది. ఇందులో గౌణార్థమే గౌతముడని చెప్పబడెను. అతనిభార్య లీలలు కనపర్చునదిగావున అహల్యఅని చెప్పబడినది. (హాల్యం న=అహల్య—హాల్యం=అనగా దున్నబడినది న=కాదు) అట్టిలీలలు రూపముగాగల అహల్యను భక్తి అనే పాదముచే తాకెను. అపుడా అహల్యకు లీలలు నశించగా శంఖ చక్ర గదాధరునిగా అంతరాత్మయనే రాముని ఆమె దర్శించి భక్తి పారవశ్యముచే స్తోత్రము: లొనర్చెను. పిమ్మటరామునిచే నాశీర్వాదముపొంది గౌణమనే గౌతముని యొద్దకుజేరి భక్తియను ముఖ్యార్థముచే పవిత్రురాలయి ఉండెను.

అంతట విదేహనగరమున జనకుడనేరాజు యాగము కావించుచుండ విచారణయనే నదిని దాటి విదేహజనకుని యాగము జూచుటకు ఈగురువనే విశ్వామిత్రులు నిశ్చయించిరి. పిమ్మట ఈముగ్వురు పయనమై ఆనదీసమీపమునకు వచ్చిరి. ఆనదిని వీక్షించుచుండగా గూడార్థమనే గుహుడు అచ్చటకువచ్చి విచారణయనే నదిని ప్రవేశింపజేసి కొన్ని గూఢవా

క్యములు ముచ్చటించి పిమ్మట విదేహజనకుని పట్టణమునకు జే ర్చెను. అందులో ప్రధానమగు గురువనే విశ్వామిత్రుని విదేహ జనకుడు వీక్షించి అత్యాతురతతో ఎదురేగి “ఈఆనందస్వ రూపులెవరు.

ఈనిత్యాత్మ స్వరూపులు ఈ తేజోమయులు వీరలంజూ డగా నామనసు పరబ్రహ్మాకారముగా నిలచెను. వీరలను నా మములచే నిరూపించి నాఆనందము స్థిరపర్చవలెను” అనిచెప్ప గా గురువు అనే విశ్వామిత్రుడు ఆమాటల కియ్యకొని వీరలను జూపి యీ తేజోమయులు జీవుడనే దశరధునకు యోగాగ్నిలో జనించిన నిత్యత్వమనే పాయసము భుజించిన పిమ్మట అఖండా ద్వితీయ చైతన్యమే రాముడుగా నవతరించెను.

అతని కనిష్ట భ్రాత విద్యానందమనే లక్ష్మణుడు వీరలు విచారణయనే నదిని దాటి విదేహనగరమును పాలించు మిమ్ము లను జూచుటకు విచ్చేసిరి. అప్పుడా జనకుండు అచ్చెరువొంది నాసీతను (సీత=యోగము) చైతన్యమనే రామునకిచ్చి పెండ్లి చేయుటకు ఉత్సాహము జనించుచున్నది. అయితే ప్రణవమ నేవిల్లు చిరకాలమునుంచి అవ్యక్త స్వరూపుడనే మాతండ్రిగారి చే స్థాపింపబడినది. అది ఈక్షణ రూపక్రియాశక్తియను ఈశ్వ రునికొెక్క ధనస్సే ఈధనస్సును నాసీత బాల్యముననే యె త్తెను.

అనగా దేహమనే ఉపాధి జనించిన పిమ్మట మాయను ముదరక మునుపు మెత్తెను. గావున అట్టివిల్లును విరచినవానికి గాని ఈసీతను యియ్యను అని ప్రతిజ్ఞబూనితిని. అందుచేత ఈకార్యము నేరవేర్చుమని ప్రార్థించుచున్నవాడను". అందులకా విశ్వామిత్రుడు అనేగురువు అఖండా ద్వితీయ చైతన్య మనే రామునితో యీవిల్లు (ప్రణవము) పరీక్షచేయుమని ఆజ్ఞాపించెను. అందులకా రాముడు మందస్మిత వదనారవిందుడై యొప్పుకొనెను. అంతట విదేహాజనకుడు పంచతన్మాత్రలనే పంచసేనాధిపతులను పంపెను. వారలచ్చటకేగి ఆవిల్లునెత్తుకుని ఆ విదేహాజనకుడుండే స్థలమునకు దెచ్చిరి. ఆవిల్లునకు ఘంటాశత ములుండెనని వున్నది.

అనగా ధర్మార్థ కామములతో గూడిన అనేకులుయీ విల్లును విరువలేక అనగా బ్రహ్మసాక్షాత్కారము నొందలేక అందుకు లోబడిరని అర్థము. ఇచ్చట అద్వితీయుడనే రాముని చే యీవిల్లు ఖండింపబడెను. అంతట విదేహాజనకుడు తన యోగమాయా స్వరూపిణియగు సీతను ఆరామునికిచ్చి పెండ్లి గావించెను. పిమ్మట బాహ్యలక్షణమనే లక్ష్మణునకు ఊర్మిళ నుయిచ్చి పెండ్లిచేసెను. [ఊర్మిళా=షడూర్మయః, అస్యాం, సంతీతి] హాకార సకారములనే మాండవి శ్రుతకీర్తులను ఇద్దరు ను భరతునకును, శత్రుఘ్ననకును ఇచ్చి పెండ్లిగావించెను. పిమ్మట జీవుడనే దశరథుడు తన నలుగురు పుత్రులకు జరిగిన వి

వాహాముసకు మిక్కిలి ఆనందమునుబొంది దేహమును మరచిన వాడాయెను. అనగా పరోక్ష జ్ఞాన ముద్భవించెనని తెలుసుకో వచ్చును.

పిమ్మట అందరూ కలసి విచారణయను మార్గమున జనుచుండ ఆధిదైవికమను పరశురాముడు [పరశునా=కరణరూప ఉపాధి ధారణేన] అచ్చటకు జనుదెంచెను. అట్టివికారరూపమును జూచి జీవుడనే దశరథుడు రిత్తబోయెను. ఆపరశురాముడు రామునింజూచి నేను దేహమునందు రమించుచుండగా నీవు ఆత్మయని ఏలరమించుచుంటివి. నేనుండిన నీవెట్లుందువు. నీవు వుండగా నేనును అట్లే అని వాగ్వాటీతో వాదము జరిగిన పిమ్మట ఆయాత్మా రాముడు భూతప్రపంచకము మిధ్యయని తలంచి తనయందు ఉపసంహరించుకొనెను.

పిమ్మట పరశురామునకు దివ్యజ్ఞానముదయించెననియు అతను విల్లు రామున కర్పించెననియు వున్నదిగదా. ఇదియంతయు బాహ్య ప్రపంచకము. అది తనకు లోబడెనని గ్రహించవలెను. తదనంతరము సపరివారముతో జీవుడనే దశరథుడు దేహమనే అయోధ్యయందు ప్రవేశించి సర్వేంద్రియములు తమకు వశమగునట్లు పాలించుచుండెను.

• •

ఓం తత్ సత్.

గద్య:—ఇతిశ్రీమత్ కూరెళ్ల వంశక్షీర పయోధిసము
త్తారక శ్రీనృశింహాభిధాన రూప నారాయణ
చరణ సేవాపరాయణ శ్రీ కామేశ్వరీ
లక్ష్మీదేవీ రచితాంతరార్థ రా
మాయణ రూప బ్రహ్మ
విద్యయందు
ప్రథమ
సాధనమను బాలకాండము
సమాప్తము.

# అంతరార్ధ రామాయణము

## ద్వితీయ సాధనమను అయోధ్యాకాండము.

వేదార్థమనే వశిష్ఠునితో ఏకాంతమున జీవుడనే దశరథుడు ఇట్లువాక్రుచ్చెను. హేగురువరా! నాగర్భజనితుడగు రామునకు కాలపరిచ్ఛేదకత అను యుక్తవయస్సు వచ్చినట్లు తోచెను. శాస్త్రవిచారణ, శారీరక విచారణ, కర్మవిదూరత యీ మొదలగు నాసంపాదన పూర్వకమగు సర్వస్వము నేనుకూడా యీరామునియందు సంపూర్ణము నొందించి అనగా పట్టాభిషేకము నొనరించెదనని చెప్పెను. అందుకు శిష్టాచారమనే వశిష్ఠు సంతసించి లెస్సలయిన మంత్రిత్వముగల సుమంతుని యీ సామగ్రిల నొనగూర్పుమని నుడివెను.

ఆప్రకారం సర్వసంభారములను సుమంతు డొనగూర్చెను. అంతశిష్టాచారమనే వశిష్ఠుడు ఆరామునకు సర్వేంద్రియాతీతత్వమను ఉపవాసము నియమించెను. అవిద్యా రూపిణియగు కైకయొక్క దాసి మందబుద్ధియనేమందర మెల్లన క్రేగంటిచూపుల రామపట్టాభిషేక సంభారములుగాంచి హాశ్చర్యమానసురాలై హా! ఇదేమి? అవిద్యా స్వరూపిణియగు నాయేలిక జీవసంబంధమగుశక్తులకు రాణియై యుండగా ఇపుడు యీ అంతరాత్మయగు రామునకు పట్టాభిషేకము నొనరించుటెట్లు?

అని స్వగతముగ చింతించి అవిద్యా స్వరూపిణియగు కైకవద్దకు జని ఓఅమ్మా! మనకొక ఉత్పాతము జనించుచున్నది. జీవు నియొక్క సర్వస్వము అంతరాత్మయనే రామున కర్పించి తా ను నిరామయుడగునట. దశరధములకు అనగా దశేంద్రియ ములకు ప్రభువగు దశరధుడు తన శక్తుల నిచ్చిన నీకుండుటకు తావెయ్యది. అమ్మా? అని ఈమందబుద్ధిగల మందర ఇట్లు ప లికిన అవిద్యా స్వరూపిణియగు కైక అంతరాత్మయగు రాము నకు జీవుడనే దశరథుడు సర్వస్వము నర్పించిన నేనున్న అందే లయించెదను. అని సంతసించి మందబుద్ధి అనే మందరకు ఉ త్సాహము గరపుటఅనే పుష్పమాల కంఠమందిడెను.

ఆరత్నస్థగితమగు పుష్పమాలజూచి సంతసింపక అవిద్య అను కైకకు తననేర్పును జూపెను. నీయందు జనించిన గుణ ములను భరించుట అనే భరతునకు ఈఅంతరాత్మయనే రాము నకు నర్పించు సర్వశక్తులను అర్పించుమని వేడుము. ఇందుల కొక ఉపాయము గలదు. బాహ్యేంద్రియములనే రాక్షసులు, ఇంద్రియాధిష్టాతలనే దేవతలు, కలహమొంద నీభర్తయగు జీ వుడనే దశరధుడు కర్తృత్వమనే యుద్ధమొసర్చెను. ఆయుద్ధ మున పరవశుడై యుండ దేహవాసనఅనే సీలజారెను. అపుడు అవిద్యా స్వరూపిణియగు కైక ఆదేహవాసనయనే సీలజారుట జూచి తన అవిద్యాశక్తులు కొన్ని అడ్డుపెరచెను. అపుడా దశర ధుడు బాహ్యేంద్రియ స్మృతిగలిగి తన ఎదుటనుండు నవిద్యను

జూచి నేను పరవశముచే నిన్ను, దేహమునుమరచితినిగాని కన్ను తెరచేసరికి నీవుసిద్ధముగానుండి నన్ను గాపాడితివి. గావున నీ కే మి కావలయునో కోరుకొనుము. అనిన నంత అవిద్యా స్వరూపి ణియగు కైక అతనితో నిటుపలికెను.

ఓరాజా నీకు విశ్రాంతి సమయమెప్పుడు కలుగునో అ ప్పుడు నిన్ను కోరెదను. అని నుడివియుండెను గదా. ఆవరద్వ యంబును ఇప్పుడు కోరుకొనుము. వరద్వయమనగా అందున నిందున నుండక యుండు ద్వైతబుద్ధియే వరద్వయంబుగా నె న్నుకొనవలయును. ఆవాక్యములకు ఆకైక ఇయ్యకొని అహం కారమనే గృహమునకు జేరెను. అపుడు జీవుడనే దశరథుడు ప ట్టాభిషేక మహోత్సవ సంభారము లొనగూర్చు సమయమున అంతరాత్మానందుడై తన అవిద్యా స్వరూపిణియగు కైకకు ఆ సంతోషము జెప్పిన ఆకైక తనవశమగుగదాయని యెంచి ఆ మగువ గృహమునకు విచ్చేసెను. అచ్చట ముందుగా మందమ నే మందరనుజూచి నీయేలిక ఎచ్చటనున్నదని ఆమెనడుగ అం దులకామె యేమియు ననకనూరకుండెను. అప్పుడతడు:యిటు నటు జూచుటచే అహంకారమను అలక ఇల్లునకుం జేరువయ్యె ను. అంతట అవిద్యా స్వరూపిణియగు కైకనుజూచి, అంతరా త్మయగు మనరామునకు నాసర్వస్వము నర్పించెదను. అందుల కు నీవుకూడా సిద్ధముగనుండుము. అని నుడివిన అవిద్యయను

కైకయిట్లు పలికెను. నామందమనే చెలికత్తెయు నాకు జనించి
న గుణములను భరించుటయును భరతుడు నేనున్ను గూడి నా
మాదులు గలవారముగదా? అంతరాత్మయనే రామునిపట్టా
భిషేకమునకు మేమెట్లు తోడుగాగలము.

ఇదియునుంగాక యీరాజ్యభారము రాముని యందు
మోపి పరిపాలింపుమని ఆజ్ఞాపించుట న్యాయముకాదు. నా గ
ర్భజనితుడగు భరతునకు పట్టముగట్టి అరణ్యమునకు రాముని
పంపుట యుచితము. (అరణ్యం=రణనం నకరోతీతి, అరణ్యాం
శాంతాశ్రమః ఇతియావత్) తమరు నాకు దేవాసురయుద్ధము
నాడు ఇచ్చినవరములు రెండుగలవు. ఇపుడు నేను కోరునది ఆ
రెండువరములే. అంతట జీవుడను దశరథుడు అవిద్యయను కై
క మాటలనువిని పరవశుడై ఏమియు ననలేక యూరకుండెను.
కొంతతడవు అట్లుయుండి పిమ్మటయిట్లు పలికెను. "హేదుర్మ
తీ! రామార్పణ యోగ్యమయినది యితరార్పితమగుట ఎట్లు?
ధీరులు నిందింపరా! గావున యిదియంతమాత్రము వీలుగానే
రదు. నీకు రెండువరములు యిచ్చుట సత్యమే. మరివేనినైనా
కోరుకొనుము" అనిన ఆయమ అందుకొప్పుకొనక ఇవియే నా
ముఖ్యవరములు అని ముమ్మాటికి బలికెను. ఆమూర్ఖవాక్య
ములకు జీవుడనే దశరథుడు ఆరామునియందు మనసు లయింప
జేసి బాహ్యస్మృతి మరచి సమాధిలో నుండెను.

అంతశిష్టాచారమను వశిష్ఠుడు మొదలగువారు "శ్లో॥కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే। పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥ (భగవద్గీత 13 అధ్యాయం) కార్యకారణ కర్తృత్వ హేతువగు ప్రకృతివశుడైన ఆజీవుడనే దశరథుడు రాకుండుటజూచి వగజెంది లెస్సయిన మంత్రిత్వమను సుమంతుని బిలచి దశరథుని రావింపుమని ఆజ్ఞాపించెను. అంతట అతడచ్చటకేగి జీవుడనే దశరథునిజూడ అతడుబాహ్యస్మృతిలేక యుండెను. అందులకా సుమంతు డాశ్చర్యము నొంది అచట నుండు పరివారముతో ఏల యితడిట్లుండెను. అని అడుగవారలు చెప్పుటకు శక్తులు లేక యూరకుండిరి. అపుడు అవిద్యయనుకైక ఇట్లుపలికెను. "రాముని దర్శించినగాని యితడు జాగరూకుడుగాడు. వికారములు శాంతింపవు. యిచ్చటకి నీవారాముని తీసుకుని వచ్చిజూపుము. అనినవిని ఆసుమంతుడు రామునకు విన్నవించి అతనిని దశరథుని దర్శించునట్లు జేసెను. పిమ్మట జీవుడను దశరథుడు కనువిచ్చి రామునిజూచి మౌనమున యూరకుండెను. అంతట అవిద్యయను కైకజూచి తాను జెప్పనారంభించెను.

హే రామా! ఈబాహ్యాముననను మరచియుండిన దశరథుని వాక్యములు ఏవియనగా "నీకు అరణ్యమును భరతునకు రాజ్యము గట్టుటయు" నేను కోరితిని. వానిని నుడువుటకు సిగ్గుజెంది దశరథుడు యూరకుండెను. గాన నీవు సర్వజ్ఞుడవు, లోకాను

సారముగ కార్యము జర్పుమని దృఢముగా జెప్పెను. అందుల కారాముడు ఈస్వల్పకార్యము నాకు శాసించుటకు వెరపులేల: ఇవి స్వతస్సిద్ధముగా నుండునవి. నేను చేయుటకు వెరువను. సిద్ధముగా నుంటిని అని తన పనియందు తాను జాగరూకుడై కార్యములు జరుపుచుండెను. పిమ్మట జీవుడనే దశరధుడు కించి దృష్టి ప్రసరింపజేసి సర్వత్రజూచి రామునకుందక్క నన్యమించుకైనను గానమే అని యప్పటియట్లు సమాధియందుండెను. పిమ్మట ఆరాముని జననియగుకుశలతగల కౌసల్యవద్దకురాముడు జనెను కర్మజ్ఞాన సముచ్చయమగుధ్యానముతో ఆకౌసల్యఅతనిం జూచెను. అనగాఆరామునిందర్శించెను. అంతఆనందమానసురాలై నిత్యాత్ముని ప్రేమించుచుండ, అతడు, "సర్వగుణాతీతమను అరణ్యమునకు వెళ్ళవలెను; ఇచ్చట అచ్చట నుండు వాడనుకాను" అని నుడివిన కుశలతయను కౌసల్య అట్టి పూర్ణవాక్యమునందు లీనమొందెను.

పిమ్మట లక్షణమనెడు లక్ష్మణుడు గంభీరధ్వనులతో "నాకుముఖ్యలక్ష్యమగు కార్యమునకు భంగమనెడు పట్టాభిషేకభంగము చేయుటకు లోకమున యెవ్వరికిని వీలుగాదు. అగుచోభరింపగలడే? ఈలక్ష్మణుడు. అని భక్తిప్రేమాతిశయములచే నుడివిన గంభీరధ్వనులకు ఇంకొక అంతర్వాణి జనించెను. ఏతత్ స్వరూప నామరూపాదుల నొసరించి మోహకార్యముల జెందుటేల? లేనిదానియందున్నదని ఉన్నదానియందు లేదని ఈవాద

నలు చర్చించుటకంటె సర్వము ఆత్మమయమని తెలసి ఊరకుం
డుట మేలని నుడివెను. సర్వత్రి మైత్రియను సుమిత్రివద్ద లక్ష్మ
ణుని విడుచుటకు నిశ్చయించెను. అందుకు ఆలక్ష్మణుడొప్పు
కొనక వెంటనే జనెను. కుశలతయను కౌసల్యకు వైరాగ్యము జ
నించి ఏమియు ననలేక ఊరకుండెను. పిమ్మట యోగమాయా
రూపిణియగు సీతవద్దకు జని తన కాలోచితములు నుడివెను.

అందుల కాయమ హాశ్చర్య మానసురాలై అయినంగా
నిండు. నేను తమ వెంట ఉండుదాననే కదా! నన్ను విడచియుం
డుటకు నీకుగాని నాకుగాని యన్నడును జరుగదు. గావున మ
న మిరువురము పయనమైపోవుదము రండు అని దృఢముగా బ
లికెను. అందుల కారాముడు అరణ్యమున కేగుచుండ యోగ
మాయా రూపిణివగు నీవు నా వెంట నుండుటచేత నాకేదో వక
రూపము నిడగలదానవగుదువు. గావున ఇచ్చటనే వసింపుము
అని పలికినతోడనే ఆమాటల కామగువ ఇయ్యకొనక నీవు కొ
న్ని కార్యములు నొందించువరకు నేనుండవలయును. నావలన
గాని ఇతర కార్యములు సాధింప సాధ్యముకాదు. అని వెంటజ
నెను. అపుడంతర్లక్ష్యము, లక్షణము, ఉభయులకును సమగూ
ర్చుయోగము, ముప్పురు కలసి అవిద్యయను కైక వద్దకున్న
జీవుడనే దశరధుని వద్దకున్నజని "మాకు అరణ్యమున కేగుటకు
అనుజ్ఞనొసంగుడు" అని వేడిన అందులో అవిద్యయను కైక త
నకడనున్న నారచీరలను అవిద్యా వృత్తులను గట్టనిచ్చెను. అం

తట సాక్షాత్కారుడగు రాముడు ధరించెను. పిమ్మట లక్ష్మ
ణుడుకూడ ధరించెను. యోగమాయ సీతయగుటచేత విష
యానందమే వస్త్రముగా ధరించినది గావున ఈనిర్ణయవస్త్ర
ము లామెకు అక్కరలేక పోయెను.

తదుపరి సాధనరూపమగు రథము తెచ్చుటకు సుమంతు
ని నియమించెను. అట్లా రథము తెచ్చి అనుపతినీయులను విచ్చే
యుడని ప్రార్థించెను. అట్లుగానే వారధిష్టించిరి. పిమ్మటలోక
వాసనచే రథమునిల్పుడని దశరథుడున్ను, పరవాసనచే నడుపు
డని రథారూఢులున్ను, యిరువురియొక్క వుద్యమములలో పర
వాసనయే శ్రేష్టమని సుమంతుడు యెరిగెను. ఆధారాది చ
క్రములయొక్క గతులుదాటి కంఠస్థానమనే తమసాతీరమున
కు చేరువయ్యెను. అంత గూఢమనే గుహునితో సఖ్యమొనరిం
చెను. తదుపరి మహావాక్యములనే జడలు యేర్పడెను. గూఢా
ర్థమనేగుహుడు దేహమనేఅయోధ్యను విడచితిరని తమవల్ల తెల
సినది. గూఢమను నాయొక్క పట్టణము పట్టము నొందుటకుఆ
టంకముండదు. కావున ఇదిమీరు స్వీకరింపుడనిన, యారాము
డు గూఢమను బంధము నాపైని మోపుకొనుటకు వీలులేదు.
గూఢ మనినను బాహ్యమనినను తానైన పరమాత్మయే కావు
న ఇది ఇది అనునది ఏదియు నేనుగట్టుకొనుటకు వీలులేదు. అ
ని దృఢముగా బల్కెను. పిమ్మట సంకల్పములనే తృణములను

శయ్యగా గావించి అంతరాత్ముడనే రాముడు, యోగమాయ యగు, సీతయు శయ్యాగతులై శయనించిరి.

బాహ్యాలక్షణమను లక్ష్మణుడు స్వశక్తితో కావలివుండెను. గూఢార్థమనే గుహుడు కూడా అచ్చటనే వసించి ఆహా? ఈసంకల్పజాలములనే తృణములను శయ్యగా గావించుటకును అసగాపీనినినిరోధించుటయను క్రియలీవిద్యయను కైక వుండుటవలన గదా, యీాశ్రమకు హేతువయ్యెను, అని గూఢార్థమనే గుహుడు వచించిన, బాహ్యాలక్షణమనే లక్ష్మణుడు ఇట్లుపలికెను. "వారికి శ్రమయని యోజించుట ఉచితముకాదు. మన భిన్నదృష్టికి అట్లురూపించుటయే కాని కేవల సమాధిచే అట్లుగాదుగదా? సర్వము పరమాత్మమయమై యుండ యిట్లు వేరుకల్పించి శ్రమయని యోచించుట వివేకలక్షణముగాదని దృఢముగా బల్కెను". అంతలో వానికి జ్ఞానోదయమయ్యెను. పిమ్మట కాలక్రమముగా రాముడు ఋష్యాశ్రమముల జేరేను. (అనగా ఆర్షదృష్టమగు వేదసముదాయమునకుమూలస్వరూపమగు ప్రణవముయొక్క అనాహతనాదములోనిలీనుడయ్యెనని తాత్పర్యము) ఇదిఇట్లుండసుమంతుడు తనమనోరథమునుమరల్చి దేహమనే అయోధ్యకు జీవుడనే దశరథునితోను అవిద్యయను కైకతోను రామునియొక్క నిజస్థితిని తెలుపుటకు వచ్చెను. అచ్చట జీవుడనే దశరథుని కుశలతఅనే కౌసల్యవద్దనుంచిరి. పలయనిన రాముని గనిసది గావున. అంతలో ఈసుమంతుడు వచ్చి రాము

నియోక్త యథార్థతత్త్వము అనగా సుఖస్థితిని జెప్పెను. అం
దుల కాదశరథుడు బాహ్యాడంబరముకు వెరవుజెంది చంచలమ
నే దేహాతత్వము విడచి నిశ్చయమనే పరతత్వముజేరెను.

అంతట కుశలతయను కౌసల్య మొదలగు యోషిజ్జనము
లు తదేక నిష్టాగరిష్టులై యుండిరి. పిమ్మట శిష్టాచారమను వ
శిష్ఠు డచ్చటకు విచ్చేసి వాసనా రాహిత్యమను దశరథుని
తనువుజూచి ప్రకృతికి బోధజనించువరకు ఏకాగ్రనిష్ఠఅనే తైల
మందు తప్తమొనరించవలెనసి శాసించి పిమ్మట ఈ క్రియ భర
తునకు సూచింపజేసెను అనగా ఉదాజిన్నగరమునందు భరతు
డుండెనని ఇదివరకుండు విషయమే. అది ఉదారబుద్ధియని ఎ
న్నవలెను అట్టిబుద్ధి జనించు స్వభావము భరతుడని ఎన్నవలెను
వశిష్ఠునిశాసనానుసారముగాభరతుడుయాయాక్రియలొనర్చి పిమ్మ
ట యారాముని దర్శించుటకు కుశలతయను కౌసల్య మొదలగు
పరివారమును జేరి అవిద్యయను కైక ఆమె చెలికత్తెయగు మం
దమను మందరనున్ను విడనాడి తక్కిన పరివారముతో పయ
నమాయెను. కొంతదూరము గడచిన పిమ్మట గూఢార్థమనే
గుహుడు ఇచ్చటకు వచ్చు పరివార మెవ్వరు? అంతరాత్మయ
గు రామునకు శత్రువులా? లేక మిత్రులా? అని యోజించి ఇ
ట్లు నిశ్చయించెను. శత్రువులయిన యడల గూఢార్థముచే విమ
ర్శించి నాయందు తలపెత్తనీయక ముంచివైతును. మిత్రులయి

న యడల నాపకారకరములుగ ఉంచుకొనియొదను. ఆ మధ్యా మార్గమును గాచియుండెను.

ఇంతలో వారలు సమీపించిరి. ఆసమయమున గూఢార్థమనే గుహుడు వారలనుజూచి అంతరాత్మయనే రాముని జూచుటకు కుతూహలమానసులై యుండిరని గ్రహించి వారలకు సగౌరవము లొనర్చి పైబాటకు జేర్చెను. అంత నాభరతుడు భరద్వాజాశ్రమమునకు జేరెను. (భరత్ + వాజః = భరద్వాజః - వాజఃనామ = గుర్రము. ఈగుర్రము ఇంద్రియములకు పోల్చుడమైనది. ఇంద్రియములకు ఆశ్రయముమనస్సు. ఆమనస్సును దృఢీకరించినవాడు అనగా లెస్సయినబుద్ధిచే గొప్పవిచారణకు స్థానమయినవాడు). అచ్చట ఈభరద్వాజునకును భరతునకును సఖ్యమాయెను. తనదృఢమయిన విచారణశక్తి భరతునకు భరద్వాజుడు విందుగా నొసగించి గమ్యస్థావమునకు జేర్చెను. తరుపరి వారలు వాల్మీక్యాశ్రమమునకు జేరిరి. (వాల్మీకిః=బహుఛిద్రాం, అవిద్యాం అతీత్యఆత్మతత్వం యాతీతి వాల్మీకిః).

ఆయాశ్రమము జేరిన పిమ్మట "శ్లో॥ ధ్యాతృధ్యానే విహాయనివాతస్థిత దీపవద్ధ్యేక గోచరంచిత్తం సమాధిః". అట్టి సంప్రజ్ఞాత స్థితియగు రాముని దర్శించి లాలిత మానసుడై ప్రార్థించినవాడై యిట్లువాక్రుచ్చెను. "యో దేవాదిదేవా! ఈ

సంసారమిప్పుడు విడుచుటకు నియతికాలము కాదు. ఎందువల
ననగా దృగ్జ్ఞాతమగు మేమందరము నీయందుంటిమి. సుమ్ముల
ను నీయందు లయించుటయను పాలన మొనరించి సర్వగుణాతీ
తమగు అరణ్యమున [అనగా శాంతాశ్రమము] ప్రవేశించుట
న్యాయము? అవిద్యయను కైకయొనర్చు కార్యము మీరు
లెక్కించితిరా? అట్టిస్వభావము విడనాడి నాప్రార్థనల నంగీక
రించి ఈదేహమను అయోధ్యలోనుండు మమ్ముల నందరినిమీ
యందు లయమొందించుటయను పాలన మొనర్పుడని ప్రార్థిం
చెను. అంత ఆరాముడు అట్లుచేయుట యుచితము కాదు. బా
హ్యాముజడమగుటచేఎప్పుడుఅట్లుగానేయుండునదిగాదు. అంత
రమగు చైతన్యమో నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వరూపమై యుండు
నది గావున ఈరెంటికి చేరికచేయుటెట్లు? సూర్యరస్మితో చీక
టిని గూర్పవచ్చునా? అట్లుగానే నీవు నీయాజ్ఞానుసారముగా
పరిపాలింపుము. నేను నాయాజ్ఞానుసారముగా పాలింతును. అ
ని మృదుమధుర వాక్యములతో నూరార్చి పలికెను. అందుల
కా భరతు డొప్పుకొనక గుణ·నిరోధము గావించి పూర్ణసమా
ధిపరుడై యుండెను.

అంత నాయంతరాత్మయందు ఒకటి జనించె. వేదార్థము
వంకజూచి నీవు వాగూపకముగా కొన్ని పన్నుగడలం పన్ని
నన్ గాని కొన్ని కార్యములుజరుగ నేరవు. అని నుడివిన అట్లే వే
దార్థమనే వశిష్ఠుడు వాగ్వ్యాపకముగా కొన్నిబలికెను. హే

వత్సా? అంతరాత్మయను రాముడు అహంకారాది వృత్తులను అనగా రావణాదులను సంహరించువాడు (రావయతీతి రావణః) అనగా భూలోక, భువర్లోక, స్వర్లోకములను క్షోభాయమాన మొందించి ఎందున విశ్రాంతి లేనివాడై యున్నవాడు) దానిని (అహంకారమును) పరతత్వమునం దుపసంహరించవలెను. అంతవరకు యితర కార్యములేవియు జేయగూడదని జీవుడగు దశరథుని శాసనము. ఈరాముడన సాక్షాత్ జ్ఞానస్వరూపుడె. మీసంఘాతమునందు ఉండియు ఉండనివానిగా తెల్సుకొనుము అనిదృఢముగా బలికిన యాభరతుడుహాశ్చర్యమానసుడై ఆహా! ఇతడే నా ఆత్మారాముడు. మాయింద్రియాదులయందుఉండువాడని తెలసి యిప్పుడు తెల్పిన దృఢవాక్యములు వినుటచేఉండి, వుండని వాడని తెలుసుకుంటిని. అని దృఢపరచుకుని అతని పాదపద్మముల తనహృదయమునందు నిలుపుకొనినవాడై ఆసందమను నందిగ్రామమునను౦డెను. నందిగ్రామః=అస్యగ్రామస్య, అయోధ్యోపకంఠత్వాత్ దేహవాసనా త్యాగరూపానందవాన్ ప్రదేశః, ఇత్యర్థః, నామనందినాం=ఆనందినాం, గ్రామః, సమూహః, ఇతియావత్) అచ్చట పరతత్వము నొందించునట్లున్నదని తెలుసుకొనవచ్చును. ఇదియె నందిగ్రామము.

పిమ్మట రాముడు ఇచ్చట నేనుండిన వాచికజ్ఞాన వుధికమై వీర్లకు నాకు వకపొత్తు నుండునట్లు భావించి మాటిమాటి

కి నన్ను జూచుచుందును. ఇట్లు కాలము గడిపిన అహంకారు డనే రావణుడెట్లు జచ్చును. అని నిశ్చయించి మహారణ్యమున జొచ్చెను. (అరణ్యాంనామ శాంతాశ్రమః)

ఓం తత్ సత్

గద్య:—ఇతి శ్రీమత్ కూరెళ్ల వంశక్షీర పయోధిసము
త్తారక శ్రీనృశింహాభిధాన రూప నారాయణ
చరణ సేవాపరాయణ శ్రీ కామేశ్వరీ
లక్ష్మీదేవీ రచితాంతరార్థ రా
మాయణ రూప బ్రహ్మ
విద్యయందు
ద్వితీయ
సాధనమను అయోధ్యకాండము
సమాప్తము.

# అంతరార్ధ రామాయణము

## తృతీయ సాధనము

### అరణ్యకాండము ప్రారంభః

పిమ్మట అత్రిమహాఋషి (అత్రిః— ఆయ=నిష్ణవే, పర బ్రిహ్మణి, త్రిః= త్రికూటస్థానమిత్యర్థః) ఆశ్రిమమునకు జేరె ను. మూడు స్థానములు. అనగా నాభి, కంఠము, హృదయ ము. వీనిని దాటి మీాదనున్నవాడు, అత్రియనియు, అసూయ రాహిత్యమే, అనసూయ, యనియు దెలసి, యీా వృద్ధదంపతు లను దర్శించెను. పిమ్మట వారలాశీర్వాదములొనరించి, అన సూయయను ఆవృద్ధాంగన యోగమాయ అను సీతను అక్కు నన్ జేర్చి అతిరహస్యములనే ఆభరణములను నామెకు నలంకరిం చెను. త్రికూటాతీతమను అత్రి ఆరామునితో కొన్నిముచ్చ టించెను. తర్వాత ఆమహారణ్యమున కొన్నివింతలు గాన్పించె ను. ఏలన నిర్మలోదకమునందు ధూళి యేమాత్రము పోకినను దృష్టిగోచరమగును. అట్లుగానే తెలుసుకోవలెను. హంసాక్షరీ యును, అంతరాత్మయు, అటునిటుయుండ యోగమను సీత మ ధ్యనుండ మువ్వురు పయనమై పోవుచుండ మధ్యమార్గంలో వి రాధుడు అనగా శూన్యవాది (విగతా, రాధా, యస్యసః= వి రాధః= అపూజకః, ఇత్యర్థః, శూన్యవాదిత్వాత్.) దృశ్యమ

య్యెను. వీరలంజూచి ఆ విరాధుడు అట్టహాసము చేసెను. అం దులకేమియు వెరవొందక శూన్యవాదుడను విరాధుని బరిమా ర్చెను.

అంత వానికి మాయనశించి జ్ఞానోదయమై అంతరాత్మ యనే రాముని నిత్యస్వరూపునిగా దెలసి బ్రహ్మానందమగ్న మానసుడై కొన్ని స్తోత్రములొనర్చి సంశయరాహిత్యమొందె ను. శల్యములయందు రామనామాంకితములు నిండి నిబిడీకృత ములుగానుండుస్థితిశరభంగుడు. అనగా కోరికలణచినవాడు శ రభంగుడు అని పోల్చవచ్చును. (శరభంగః= శలేషురామనా మాంకనరూపభంగాః, యస్యసః= శరభంగః, రలయోరభేద త్వాత్). అట్టి గాఢతపముజేయు శరభంగాశ్రమమునకు యీ అంతరాత్మయనే రాముడు విచ్చేసెను. అందులకతడు సంతస మొంది యీ శల్యములు తమయేకత్వమును అగ్నియందు హో మము వేల్చుడని ప్రార్థించెను. అతడట్లు గావించెను. ఆ యాశ్రమము గడచి లోకవాసనలచే పీడింపబడి పారమార్థిక మించుకంతయులేక మృతకళేబరము పోల్కివున్న వ్యక్తులచూచి, అయ్యయ్యో!మానవజన్మమెత్తియు, యిట్లుఐహికవాసనయందు పేలపీరు గృష్మరుచుండిరి. అని చింతించికొంతదవ్వగడచిపిమ్మ టసుతీక్ష్ణ ఆశ్రమమునకుంజేరి అంతవారలొనర్చినసత్క్రియలొం ది యా సుతీక్ష్ణుని భక్తివినయములకు సంతసించి, నీగురువెవ రని అడిగెను. అందులకాసుతీక్ష్ణుడు (సు=లెస్సయిన, తీక్ష్ణః=

చురుకుదనము, అనగా మంచి పట్టుదలగల బుద్ధిశాలిత్వము), నా దేశికుడు అగస్త్యుడని బలికెను. (అగ_స్త్యః=అగం, స్థాయతీ తి= నాశయతీతి పర్వతసదృశాచంచలమాధ్యం నాశయతీతి=అ గ_స్త్యః)

ఆయాశ్రిమము తమకు జూపుమని ఈఅంతరాత్ముడగు రాముడు నుడివెను. అంత వారలను దోడ్కొని సుతీక్ష్ణుడు ఆ మార్గమునంబట్టి బోవుచుండ యా సుతీక్ష్ణుని జూచి "యో బాలా! ఈ జీవన్మృతు లెవరని అడిగెను." అందులకాతడిట్లు పలికెను. "విషయములనే రాక్షసులచే మ్రింగబడి యిట్లుచచ్చి యున్నవారని చెప్పినపైని యారాముడు యీరాక్షసులను దుంచి వీరలకు సుఖము నొనగూర్చెదను." అని నుడువుచుం డ అంతలో అగస్త్యాశ్రిమము జేరువయ్యెను. ఆ అగ_స్త్యమహా ఋషి ఆ రాముని రాక అతిరయముగ గ్రిహించి సగౌరవము లొనర్చెను. అనగా పూజించెననికూడా చెప్పవచ్చును.

తదుపరి యా ఆత్మారామునిజూచి అగ_స్త్యమహాఋషి యో దేవా! "నీవు సృష్టియాదియందు ఏకస్వరూపుడవై రాను రాను నామరూపములతోనుండునట్లు రూపించితివి. (శ్లో॥ పర మాత్మాద్వయానందః పూర్ణఃపూర్వే స్వమాయయా। స్వయ మేవ జగద్భూత్వా ప్రావిశత్ జీవరూపతః॥ పంచదశీ, నాటక దీపిక) (శృ॥ ఏకమేవా ద్వితీయంసన్, నామరూప వివర్జితం

సృష్టేః పురా...ఇతి సూర్యునియందు చీకట్లారోపించినట్లు నీ యందు జగమ్ము లారోపించి చూచుట. (యథాఽప్రకాశో న తువిద్యతేరవౌ జ్యోతిస్స్వభావే పరమేశ్వరే......అధ్యాత్మ రామాయణం) అట్లే ఇదియుంగాక స్థూల, సూక్ష్మకారణోపా ధులను గల్పించి వాటియందు సూత్రాత్మకుడవై నటించి పి మ్మట నేదియుంగాక పరిపూర్ణుడవై నిండియుంటివి. నిన్ను శో ధించుటకు నామనంబు పరువులెట్టి వెతకి వెతకి వేసారి మౌన మొందెను. నావాక్కు స్తోత్రముచేయుటకునెంచి, పలుకునది పలుకుబడినది నొక్కటిగా నుండుటచే వాక్కు లయమొందెను. అందుచే నిన్ను శృతులు అవాఙ్మానస గోచరుడవని బల్కుచు న్నవి. (శృ॥ మయ్యేవసకలంజాతం, మయిసర్వంప్రతిష్టితం। మ యిసర్వంలయంయాతి దద్బ్రహ్మాద్వయమస్మ్యహం.) అనునట్లు, సర్వము నీయందు ప్రతిష్టితమై యున్నది. అని యీవిధముగా స్తుతులొనర్చి, ఈ అంతరాత్మయనే రామునకు చాపతూణీరము లొసంగెను.

[చాపతూణీరములనగా దేహాత్మబుద్ధి నశించుటకువిమ ర్శయనునది, విద్యయనునది, రెండుసాధకములు.] పిమ్మట యం తరాత్మయనే రాముడు నంతసించి యీయగస్త్యమహాఋషివ ద్ద శెలవందుకొని భూభారము హరించుటకయి బయలు వెడలె ను. తదుపరి అనేక సంకల్పరాసులు నొకజడగా నల్లుకుని స్థిర పరచునది ఒకానొక వ్యక్తి అనగా జటాయువనేవ్యక్తి మధ్యమా

ర్గములో కాన్పించెను. అపుడు ఋషిభక్షకునిగా దానినెంచి రాముడు బాణము సంధించి వేయయత్నించు సమయములో ఆజటాయువు అతనిని రామునిగా దెలసి యోరామా! జీవుడగు నీతండ్రికి నేను సఖుడను. గాన నన్ను వేరుగా నెంచకుము. ఈబాటను నీవువచ్చెదవని తెలసి నీదర్శనమునకై వేచియుంటి ని. ఓపరాత్పరా! నాబాటలో డాంబికు లనేకులున్నారు. అం తర సుఖము మరిపించి యోగమను సీతను నపహరించగలరు. గాన యిరువ్రక్కల స్వరూపమను నీవును నిశ్చయమను లక్ష్మ ణుడును యోగమను సీతను గాచుకొనుడు. అని నుడివిన విని న చ్చెరువొంద క్రమముగా న్యవహారమను పంచవటి ఆశ్రమము నకు జేరెను.

ఇచ్చటనే లోకుల నుద్ధరించుటకు ఈతీరమున వకనెల వు కట్టుకొనెను. ఎట్టిదనగా పామరులను గడతేర్చుటయు పం డితుల నాదరించుటయు దుష్టుల బొరిగొనుట అను నాశ్రమము గట్టుకొనెను. పిమ్మట విద్యయను రాముని జూచి విమర్శయను లక్ష్మణుడు దేవా, స్వరూపాను భవము దెల్పుడని వేడెను. అందులకా రాముడు విమర్శయను లక్ష్మణుని జేరదీసి మృదు మధురము లొలుక జెప్పనారంభించెను. బిడ్డా! నీసంకల్పమే సం సారము, సంకల్ప సంహారమే సంసారనాశనము. గావ నీసంసా రము నీయందుపసంహారించుకొనుము. అంత నీవై ప్రకాశింతువు. నీకన్య మేమాత్రములేదు. ఉండునట్లు తోచునది మాయ.

దాని నడంచుము. జాగ్రత్స్వప్న సుషుప్తులుఅను మూడవస్థలు గనువాడు అన్యుడా, అనన్యుడా, అనిన పీలు చిక్కదు. అన్యుడనిన తానుకల్పించి అవస్థలుగా గనువాడు గావున అన్యుడుగానేరడు అన్యుడుగాడనిన అవస్థలు వేరు, తాను వేరు. ఇట్లు జూడజూడ పైనజెప్పునదే నిశ్చయము. "శృ॥ పశ్యన్నైవ నపశ్యతి" అను శృతివచన ప్రకారము సుషుప్త్యవస్థయందు పురుషుడు (పురి, ఉషతి, పురుషః=జీవుడు) చూచుచునేయున్నను రెండవ పదార్థము లేకుండుటచే చూచువాడు కానేరడు.

ఈ ప్రకారము దెలుప స్వరూపమను లక్ష్మణుడు దెలసుకొనివిశ్రాంతి నొందెను. పిమ్మట శూర్పణఖ (చుప్పనాతి), (శూర్పణఖా=శూర్పవన్నఖవతీత్యర్థః- శూర్పసాహ్యేన యథా సదసత్పదార్థ విభేదం కర్తుం శక్నువంతి, తథాయేషాపి రామ రావణయోర్భేదం జ్ఞాతుం సమర్థేత్యర్థః, విపరీతజ్ఞానేన) రామలక్ష్మణులరాక రావణునకు దెల్పెను. రావణుని దృష్టిరామునియందు నిల్పెను. ఇరు తెగలవారికి మేలొనర్చెను. ఈవిశేషణములుగల చుప్పనాతి (శూర్పణఖ) మూఢభక్తినొంది రామునివద్దకువచ్చి తన్ను గలియుమని వేడుకొనెను. అందులకారాముడు నాయోగమనే సీత నన్నువిడువదు. బాహ్యలక్షణమనే లక్ష్మణుడు నిన్ను మోహించును. గాన నందుజనుము అనిన నట్లు ఆమె గావించెను.

అంతదానింజూచి బాహ్యాలక్షణయను లక్ష్మణుడు లో కనాథుడగు రాముని పొందుము. నన్ను పొందకుము అని చెప్పి రామునిజూచి లక్ష్మణుడు తనకు ఆజ్ఞవిధింపుమని వేడినపై మని ఆమె వెనుకభాగము (చుప్పనాతి వెనుకభాగము) దెలసి నా రూపములుఖండించుమని వ్రాసెను. ఆయాజ్ఞనులక్ష్మణుడు దెలసి ఇవియే ముక్కు చెవులుగానెంచి వాటిని ద్రుంచెను. వెలికి ప్రవహించు దృష్టియే రక్తప్రవాహముగానెంచి గోడుగోడున విశుద్ధ ఆజ్ఞాచక్రములు మొదలు లం పృథ్వీ తత్త్వాత్మనే అను ఆధార చక్రమువరకు నేను నాది అను పరిపాలించు అహంకారమనే రావణుని సమీపించి, ఓసోదరా! నాదురవస్థ గంటివా? పంచవటీతీరమున రాముడు లక్ష్మణుడు అను నామములుగల ఇరువురు నివసించియున్నారు. రామునికి సీతయను భార్యగలదు.

నేనరణ్యమున సంచరించుచుండగా నన్నుగనినాముక్కు చెవులులక్ష్మణుడు ఖండించెను. ఇట్టిదురవస్థ పట్టినందులకు తగిన యోచనచేసి వారిని మోసబుచ్చుము. అందుకు నేనొక సలహా జెప్పెదను. ఆ సీతను అపహరించిన, రామలక్ష్మణులు వశులగుదురు. అని నుడివిన, ఆసోదరీవాక్యములకు ఖేదమోదములబెనగొన ఈదుష్టులనెట్లు వంచింపగలను అని, అహం, అహం, అను అంతఃపురమునకు బోయెను.

ఎక్కువ జిజ్ఞాసగలవాడై జ్ఞానేంద్రియములను మారీచు సదనమునకు జేరెను. అతడు సుషుప్తిసుఖమునొంది అప్పుడే

మేల్కొనెను. అంత కనువిచ్చుసరికి రావణాసురుడు ఎదుట ని
లచెను. వానినిజూచి యోరాజా? నీవు వంటరిగా వచ్చుటకు
ఏమికతమో తెలియదయ్యెను. అనిన యారావణుడు నీవల్ల
యొకవుపకారము కావలెనని ఇచ్చటికి వచ్చితినననెను. ఆవుపకా
రమెట్టిదనగావినుము. రామలక్ష్మణులుయిద్దరుగలరు. అందులో
రామునకు సీతగలదు. అచ్చటికి నీవేగి నీ యింద్రియవికారము
లను జూపుము. అందులకాసీత ఆరాముని మరచి నిన్నుకోరు
ను. నిన్ను చలనస్వరూపమని తెలియక రాముడు పట్టగోరును.
అందుచే రామునకు సీతకు ఎడబాపుగల్గును. అచ్చట నేనుండి
సీతను మెల్లగా నపహరింతును. నాపరిజననములలో నీవు యొ
కడవు. గాన యీవుపకారమొనరింపుము. అనిన యారావణు
ని మాటలువిని జ్ఞానేంద్రియపంచకమను మారీచు డిట్లుపలికెను.

ఓరావణా? యారాముడు బాల్యమున నన్ను నిగ్రహిం
చెను. ఇప్పుడు పూర్ణానుభవము గలవాడు. నేను మోసపుత్తు
ననిన నన్నతడు అణగద్రొక్కును. గాన నేనచటికేగి తిరిగివ
చ్చుటసున్న. ఇదియుంగాక అట్టిరాముని నీవు మోసగించప్ర
యత్నించుట నీయొక్క మృత్యువుకేయని నమ్ముము. అని
దృఢముగా బల్కిన యావాక్యముల కారావణుడులికిపడి, యో
మూర్ఖా? నేను బ్రహ్మసాక్షాత్కారము వరకు నుండువాడను.
గావున నన్నునీవెదిరించకుము. అనిన యారావణుని పౌరుషవా
క్యములకు యేమియు బలుకలేక ఆకార్యమున కియ్యకొని కా

మృగరూపముధరించి చూచుట, వినుట, ఆఘ్రాణించుట,తినుట, స్పర్శించుట, అనే యీగుణములతో గంతులువేయుచుండ ఆ సీత బాహ్యాడంబరమను ఈమృగమును నాక్రీడామందిరమున నుంచుకుని కొన్నివినోదములు సల్పెదను, గాన యీలేడిని పట్టితెమ్మని రాముని వేడెను. అందులకారాముడు తనకులసతి ముద్దు చెల్లించుటకంటె నొందుకార్యమేమున్నదని నిశ్చయించి యీలేడిని బట్టుకొనుటకు బయనమయ్యెను.

అంతట విచారణకర్తయను లక్ష్మణుడచ్చటకు విచ్చేసి ఆ రామునిజూచి, యోదేవా! ఇది లేడియని యనుకొనియెద రు. అట్లుకాదు. కేవల ఇంద్రియాడంబరమును మారీచుడు. వీనిని బట్టనెంచిన లోకవాసనలో ముంచివేయును. గాన వీని యందు పేక్షాభావనయుత్తమము. అని నుడివినను ఆ రాము డు కార్యానుసారముగా వానిని బట్టయత్నించెను. ఆమారీచు డు (జ్ఞానేంద్రియసముదాయము) అనేకవిషయాదులం ద్రిప్పి ద్రిప్పి మొదట విచారణయను లక్ష్మణునిస్మరించుట సీత (యోగము) గని యాయంతరాత్మయను రాముడు సంపూర్ణుడ య్యెనేమో యికనేనేలయని విచారించెను. విషయానందమని నను, విద్యానందమనినను ఆనందమొక్కటియేగదా! ఆ యో గమను సీత విషయములను మారీచుని కోరుటచే మాయావశు రాలై విద్యయను రాముని వైరాగ్యమను లక్ష్మణుని విడనా డెను.

అంత దురాత్ముడగు రావణుడు అచ్చట ప్రవేశించి యీయోగమను సీతను తన్ను పొందుమని భిక్షుకునిరూపముతో వేడుకొనెను. అందులకాసాధ్వీమణి, ఓభిక్షుకా! నన్నునీవెట్లు కోరగలవు. నానాథుడు వచ్చువరకు నిలువుము. ఇదియుంగాక, ఆనందమే భిక్షగాగోరువారలయందు నారామునకు మిక్కిలి ఆనందము గల్గును. గాన అంతవరకు ఇచ్చట యాగుమనెను. అంతట యారావణుడు యోర్వలేక తన దశవిధప్రాణములను దశశిరస్సులను విజృంభించి "లంకను పరిపాలించువాడను. రావణ యను పేరుగలవాడను. మూడులోకములు క్షోభనొందించు వాడను. ఇట్టి యున్నతఅధికారములుగల నేను రామునిజూచి న నేనిచ్చట నిల్చుటెట్లు!" అని అహంకారపరవశుడై పృధ్వీతత్వమునందు మునిగెను.

అట్లాసీత, ఆత్మజ్ఞానమను రాముని వైరాగ్యమనే లక్ష్మణుని యెడబాయుటచే ఇట్టి దుస్థితి నొందితిని. అయినను దశద్వారములయందు వసించి విమర్శించి వీనిని దుంచవలెను. ఇదియుంగాక నాయోగమాయకు లోబడినవాడేకదా రావణుడు. ఇట్టి రావణుని సంహారించినగాని లోకములు శాంతినొందవు. ఇది యిట్లుండ ఈరావణుడు నన్ను [అనగా యోగమాయావిశిష్టురాలను.] భిక్షమడిగిననాడే ఇతడు జచ్చెనని ఎరిగెను.

శృతి॥ "మృత్యో స్సమృత్యు మాప్నోతి" వానిచే వానిని జంపుకొనునట్లు నన్ను భిక్షమడుగుటయని యెంచి

దృఢముగా నిలచెను. పృథ్వీతత్త్వమును పరిపాలించు రావణుని లంకలో అశోకా (శోకం, నాస్తీతి, అశోకం) వనికామధ్య, హంసయనువృక్ష ఛాయయందు యోగమను సీత నివసింపబడెను. ఇది యిట్లుండ విచారణయను లక్ష్మణుడు రాముని సమీపించె ను. వానిని జూచి ఓలక్ష్మణా? దుష్టుల అనగా విషయవాస నల సంహరించి నాయోగమను సీతను కాపాడుట నీకుచితము. అట్లుగాక నీవు నన్ను సమీపించిన ఆనందములేనిదే అనగా యోగానందములేనిదే విచారణ సరిపడదని యెంచి నాసీతను విడనాడితివా? దానిని జేరుటకు మనమిరువురము త్వరపడవల యును. అని పయనమై అటునిటు జూచి ఎందునను గానక అ నేకసంకల్పరాసులు జటగాధరించు జటాయువును దర్శించెను.

ఈఅనాది సంకల్ప వాసనా సమూహమను జటాయువు నుజూచి నాయోగమను సీతను యిది అపహరించెనేమోయని తలచి యోబాహ్యారూపమా? నాసీతను నీవపహరించితివా? అ నినంతమాత్రమున, యోసాక్షిస్వరూపమా? నేను జటాయువు ను. మాటిమాటికి నాది, నేను అని వాగాడంబరము జూపు యాఅహంకారమనుయారావణునిచే ఆసీతఅపహరింపబడెను. ఆ ధారచక్రమనుదక్షిణదిశనుయారావణుడు పరిపాలించును. గాన ఆదెశకేగెను.ఇంతకెక్కువ జెప్పుటకునుసమర్థుడను నేనుగాను. అని యూజటాయువుపలుకకుండెను. ఆయనాదివాసనయను జటాయు

వును సంస్కరించి యాదక్షిణదిశకు యారావణుని బరిమార్చు టకై యారాముడు బయలుదేరెను.

అంతట విశాలమగు బాహువులుగల కబంధుడు [దురాశా] కం, బధ్నాతీతి, కంబంధః, కమిత్యత్ర=జ లమిత్యర్థః జలవత్ సర్వవస్తుషు, ఆశయం, ప్రసరతీత్యర్థః అతః దురాశా) అనగా అధోర్ధ్వములు తెలియనేరక సర్వజనులను పీడించు బాహువైశాల్యముగల వ్యక్తి దృశ్యమయ్యెను. ఆవ్య క్తియే దురాశయని పోల్చడమైనది.

అట్టి దురాశయను కబంధునిజూచి వీనిని సంహరించిన గాని పైబాటదొరకదని యెంచి సంహరించెను. అంత వివేకము జనించి నిర్వికారుడగు రాముని పూజించుటే శ్రేష్ఠమనియెంచి దురాశయను కబంధుడు దివ్యరూపము ధరించెను. పిమ్మట స కారవాచ్యమగు శబరి ఆశ్రమమునకు జనుడు. అందుధ్యాన, యోగభక్తులనెడు యామార్గములు గలవు. అవి ఆరావణుని సంహరించుటకు సాధనములగును. అని కబంధుడనిన యారా ముడు సంతసించియామార్గమునజనెను. అంతసకారవాచ్యమగు శబరినిజూచి సంతసించి నీవీమార్గమున నుండుటకు ఏమికార్యమ ని అడిగిన, ఆనిర్వికారుడగు రామునితో ఓ తేజస్స్వరూపమా? సాంఖ్యతారకములను నాగురువు మతంగమహర్షి. (మతం+గ చ్ఛతి= మతంగః_ జ్ఞానార్థత్వాత్ జానాతి= సర్వేషాం, అను

మతంజ్ఞాతవానిత్యర్థః) ఆమహానీయుడు, ఈ బాటనుమీరువత్తురని దెల్పిన విని యిట్లుగాచుకొని యుంటిని. నిన్ను దెలియుటకు నేను సకారస్వరూపిననుటచే తెలియజాలకుంటిని. అనిశబరి నుడివెను. ఆవాక్యములకు అంతరాత్మయగు రాముడు, యాశబరితో యోవనితా! సకారమైనను, హకారమైనను బిందుయుక్తములేనిదీ హంసకానేరదు. అట్టిహంసత్వమునొందిననీవు మాకు ముఖ్యభక్తురాలవు. హకారముతోను, సకారముతోను, మాకు పనిలేదు. పరతత్వమునకు ప్రధానములు నవవిధభక్తుల వివరము.

ప్రథమము ఆపరమేశ్వరుని సంతతము తన హృదయస్థానమందు నిలపి సంసారాడంబరము దాటించుమని అనేక విధముల వివిక్తదేశమునందు వసించి పరమేశ్వరునిగురించి ఆక్రోశించుచు అప్పుడప్పుడు సజ్జనసాంగత్యము చేయుచువుండుస్థితి. ద్వితీయభక్తియనగా:- వేదాంత గ్రంథములను వినుటయందు అత్యనురాగము గల్గి మనస్సు సన్యాయత్తముగా నీయకుండుట- తృతీయభక్తియనిన?- ఆవాక్యార్థములను మననము చేయుచువాజ్ఞ్మనము, చేష్టామానము నొందుట- చతుర్థభక్తి అనగా వేదాంత గ్రంథముల పఠించుజ్ఞానులయందును భక్తులయందును ఇంతయేల సర్వభూతములయందును దయ, మృదువాక్యములు వచించుట మంచినడతలు గల్గియుండుట, మొదలగునవి. పంచమభక్తియనిన, గురునియందు తన మనోధనము లర్పించి సంతతము యాగురుడే త్రిమూర్త్యాత్మకమని యెంచి యాతని

నాశ్రయించుట. షష్ఠభక్తియనగా, పుణ్యశీలత్వము అనగా త నవర్ణాశ్రమోచిత ధర్మకర్మములతప్పకాచరించుచు అంతర్ముఖత్వమునొంది యుండుట. సప్తమభక్తియనిన, మంత్రములనేకములు తెలసినను వాని సారస్యము ఇపుడు గ్రహించి ఆత్మను సంధానమునకు ఎంతమాత్రము వేరుగాదని తెలసియుండుట- అష్టమభక్తియనిన హంసను రేచకపూరక కుంభకాదులతో వశపరచుకొని భ్రూమధ్యస్థానమందు వసించి దశవిధనాదములను గనుచు అంతరశీలత్వము నొందించుట- నవమభక్తియనిన, ఆత్మానుభవము నొంది దృక్ దృశ్యరహితమయిన పరిపూర్ణసుఖమునందు మగ్నమానసుడై యుండుట.

ఇట్టి నవవిధభక్తులు ఎవరికి గల్గియుండునో వారలే భక్తిజ్ఞాన వైరాగ్యములు గలవారు. అవి నీయందు సంపూర్ణముగా నుండుటచే మమ్ముల నంతరాత్మునిగా దర్శించితివి. గావున ఓ సకారవాచ్యమగు శబరీ! నీవు పరమ హంసస్వరూపమునై యుంటివి. అని దృఢముగా అంతరాత్మయగు రాముడు దెలపిన, యాశబరిసంతసించి అనేకకల్పములు గడచిన నామనస్సనే ఫలము పదేపదే విమర్శించి శుద్ధముగా నావద్ద దాచుకొని యుంటిని- నాకన్య మేమాత్రము లేకుండుటచే యాఫలమును స్వీకరింపవేగను. అనిన యారాముడు సంతసించి యాఫలము నందుకొనెను.

పిమ్మట యోశబరీ! నాయోగమను సీతజాడగంటివా? అనిరాముడుయనినగంభీరముతో ఓపరాత్పరా! సువర్ణమునకును, నాణెములకును వేరులేనట్లు నీయోగమున్ను నీవున్ను వేరై యుందురా! నీయందునీవేరమించుచుండ, నీవుహితులను గోరుట ఉచితమా? అయినను నేనరసి యిటుగాంచితిని "అహంకారమను రావణుడు; ఆధార చక్రమనే దక్షిణదిశను పరిపాలించువాడు గావున నీయోగమను సీతను ఆదిశకే గొనిపోయెను- తన్మాత్రలను సుగ్రీవపంచకము, కృషియను ఋష్యమూకాద్రి పర్వతమున నివసించి యున్నారు. వారినింగనినత ... యు చక్కబడును. అని నుడివి యాశబరి సాక్షాత్కారమును జ్ఞానాగ్నియందు లీనమయ్యెను.

ఓం తత్ సత్

గద్య:—ఇతిశ్రీమత్ కూరెళ్లవంశక్షీర పయోధిసముత్తారక శ్రీనృశింహాభిధాన రూప నారాయణ చరణ సేవాపరాయణ శ్రీ కామేశ్వరీ లక్ష్మదేవీ రచితాంతరార్థ రామాయణ రూప బ్రహ్మవిద్యయందు

సాధనమను అరణ్యకాండము

సమాప్తము.

# అంతరార్థ రామాయణము

## చతుర్థసాధనమును

### కిష్కింధకాండము ప్రారంభము.

విద్యయను రాముడు విచారణయను లక్ష్మణుడు పంపా నామ సరోవరమును సమీపించిరి. (పాతీతి_పః= పాలకః ఇత్యర్థః_ పాలకం, విష్ణుపంపా= రామప్రతీక్షణపరాశుద్ధ చైతన్యత్వాత్ ఇత్యర్థః—). సరోవరమునందలి విశేషములనుజూచి సంతసించుచుండిరి. అంత దూరదృష్టితో పంచతన్మాత్రికమగు సుగ్రీవుడు మొదలగువారిలో స్పర్శగుణకమునందు జనించు వాయువుపుత్రుడగు నాంజనేయుడు ఈ అద్భుతరూపులను రామలక్ష్మణులను దర్శించి ఎన్నడూగని యరుంగని ఈ మహావ్యక్తులెవ్వరు? అవిద్యానునిర్మూలనమొనర్చి అఖండ తేజస్వరూపులగు వీరలెవ్వరు? అని కొంతసేవు యోచించి ఆవాయుపుత్రుడు శబ్దగుణకముతో వారినవేకవిధముల స్తోత్రములొనర్చి "నేను వాక్కుచే మిమ్ములను స్తోత్రముచేయుట కశక్తుడను. మీనిజరూపములను దెలపి నాప్రాణశక్తి మీయందునిల్పుడు." అనిన విని విద్యాస్వరూపమగు రాముడు విచారణయను లక్ష్మణునితో ఇతడు అనేకశాస్త్రజాలములను పరిశోధించి అవి వాగ్జాలములని యెంచి ఈతని ప్రాణశక్తిని మనయందు అనగా స్వస్వరూ

పముసందు లయింపనెంచి యున్నవాడు. ఆహా! ఈతని మనో నిశ్చయము కొనియాడదగినదే అని వాకుృచ్చెను.

తదనంతరం వాయునందనుడు ఓ తేజోమయులారా? మ మ్ములను బాలించు ఆకాశతత్వమునకు జనించు శబ్దగుణకమను సుగ్రీవుడు గలడు. అతడు అధఃపతనమను వాలిచే అనేక శ్రమ లనొంది ఆ శ్రమలకోర్వలేక కృషియను • ఋష్యమూకః,ఋ ష్యాణాం=హరిణానాం,మూకః. బంధః,ఇతియావత్ హరిణసదృ శవిషయాణాం, బంధనస్థాన మిత్యర్థః— రామవాసయోగ్యం ఋష్యమూకాద్రిపర్వతమున జేరియుండెను. ఇదియుంగాక మ కారవాచ్యంబను "రుమ" అను అతనిభార్యను యీవాలి అప హరించెను. అట్టి ఆపదనొందినవానిని రక్షించునాథులు మీర లని యెంచి నేనిచటకు వచ్చితిని. నన్నుమన్నించి నాప్రార్థ న మంగీకరింపుడు. అనిన అందులకియ్యకొని వారలు అనగా విద్యాస్వరూపము, విచారణ యను రామలక్ష్మణులుభయులు వెడలిరి. అంత ఆకాశతత్వమగు సుగ్రీవుడు మొదలగు వారలం గలసికొని అందులో శబ్దగుణకమగు సుగ్రీవునితో తన యోగా నందమను సీతను రావణుడు అపహరించిన వృత్తాంతముకూడ రాముడు జెప్పెను.

అందులకాసుగ్రీవుడు రామా!విద్యయనుమీరుజెప్పినదెల్లవిం టిని. విచారణయను లక్ష్మణునితో గలసి అహంకారస్వరూపు

డగు రావణుని వంచించి మీయోగానందమను సీతను అరయ
గలను. అయినను అధఃపతనమను వాలిని సంహరించినగాని నే
జేయవలసినకార్యములెవ్వియు చేయజాలను. గాన అట్టిదురా
త్ముని సంహరించు పరికరము మీరలు స్థిరపరచుకొనవలసి
యుండును. అనిన విద్యయను రాముడు సరిగనే నీకార్యము నే
జేసెదను. గాని ప్రతికృతప్రకారమొకటి కల్పించుకొనవలయు
ను. అదియెయ్యదనిన, తపోగ్ని ప్రజ్వలింపజేసి నీకార్యమునకు నీవు
ను నాకార్యమునకు నేనును ప్రమాణములు కనపరచవలయు
ను. అని చెప్పెను. సుగ్రీవుడు రాముని యాజ్ఞ శిరసావహిం
చి తనుపరి అధఃపతనమను వాలితో యుద్ధమొనగూర్చెను.

లోకవాసనలయందు బలము జనింపజేయు అధఃపతన
మను వాలియు, పరవాసనల శ్రేష్ఠత్వమెన్ను శబ్దగుణకమగు
సుగ్రీవుడున్ను యుద్ధమొనర్చిరి. అంత విద్యయను రాముడు
యిరువురియొక్క చర్యలు యించుమించుగా లోకానుగుణ్యము
లేయని తటస్థభావముతో తూష్ణింభావమొందెను. అంత నా
సుగ్రీవుడు వగజెంది, ఓ రామా! నన్నధఃపతనమొందించుట
కేల యత్నించెదవు. నీయందుపసంహరించుకొనగూడదా? అ
నిన యావిద్యయను రాముడు ఓసఖా! మీరిరువురును లోక
వాసనామయులుగా యెంచబడినందుననే యూరకుంటిని ఇపు
డు నీకొకగుర్తునిడి పిమ్మట వానిని సంహరింతును. ఆగుర్తు ఎ

ట్టిదనిన; వేదాంతశాస్త్రమే వినునట్టి యొకశక్తిగా నిడిదెను. అని చెప్పి అట్లొనర్చెను.

పిమ్మట వారిరువురును యుద్ధమొనర్చిరి. అందు అధఃపతనమను వాలిని విద్యయను రాముడణగద్రొక్కెను. అందుకథలోకములన్నియు భయముచే నిశ్శబ్దములయ్యెను. వాలి నశించుటచే, తరణమను తార యీ విషయవాసనలజూచికొంత చింతించి పిమ్మట విద్యాస్వరూపుడగు రామునివంకజూచి, యో దేవా! ఈ విషయపతిని సంహరించితివి. మా నిత్యత్వమును గనుగొనలేకుండితిమి. ఇట్టి ద్వంద్వములో గొట్లాడు మమ్మేలను ద్ధరింపుమని తరణమను తార వేడుకొనెను. అందులకారాముడు సంతసించి అధఃపతనమను వాలి నశించుటచే నీ నిత్యత్వము నీకొసంగితిని.

ఇంక అంగములనే అంగదునకు నీ బాహ్యారాజ్యముండునటుల జేయుదును. అని నుడివెను. పిమ్మట ఆకాశతత్వమను సుగ్రీవుడు అధఃపతనమను వాలి నశించినందుకు సంతసించి తనశక్తిచే విద్యయను రాముని అనేకవిధముల నుతించి ఆయన కార్యము నిర్వర్తించుటకు సన్నద్ధుడైయుండ వానికి విద్యయను రాముడు యింద్రియనిరోధమను పట్టణమునకు పట్టభద్రుని గావించెను. బిందుయుక్తమగు మకారవాచ్యమను రుమను అతనికి గూర్చెను. పిమ్మట విద్యయను రాముడును, విచారణా

యను లక్ష్మణుడును, అమర్షమనుపర్వతమున నివసించిరి. అం
దు విచారణయను లక్ష్మణునకు గుణతారతమ్యములు బోధిం
చుచు సత్వరజస్తమములను విమర్శించి చెప్పందొడంగె. మొ
దటిదియగు తమోవ్యక్తి యెట్టిదనగా; కార్యారంభమునందు
సిగ్గు జనింపజేయునది. మధ్యమునం దితరులు చూచుటకును,
అంత్యమందితరులతో ముచ్చటించుటకును లజ్జజనింపజేయునది
యే తమోలక్షణము. రెండవదియగు రజోగుణలక్షణము:—
యొరులు విననెంచి చేయబడు కార్యము. బాహ్యాడంబరము
తో మంచి కార్యములన్నియు జేయనెంచుట. మూడవదియ
గు సత్వగుణప్రభావమెట్టిదనిన:— నిందుచల్లదనము. కార్యా
రంభాంతములందాడంబరము చేయకుండుట. మిక్కిలి మంచి
యోజన గల్గియుండుట. అని ఈ గుణవివరము.

అంతర్బాహ్యామధ్యలక్ష్యములను మూడుమాసములు గ
డచెను. ఇంకను నాయోగమను సీతజాడ గానకుండుట ఏమికా
రణమోయని కోపసూచన జూప విచారణయను లక్ష్మణుడు,
ఓ విరామయా? నేబోయి యానుగ్రీవునిచే చేయబడుకార్యము
నేను శాసించెదను. మీరు శ్రమనొందకుడు. అని విచారణయ
ను లక్ష్మణుడు బయలు వెడలెను. అంతట స్పర్శగుణకమగు
వాయుపుత్రుడు, శబ్దగుణకమగు సుగ్రీవునొద్దకు జని విద్యయ
ను రాముడు శాసించు కార్యములు మరచితివా? యోగమను
సీతను నరయక, మకారవాచ్యమగు రుమతో మగ్నమునొంది

యుంటెవి. ఇదియుంగాక వారు శాసించు మధ్యబాహ్యాంతరల
క్ష్యములను మూడుమాసములు గడచెను. అందుచే శాసనో
ల్లంఘనము జేసినట్లుగా నుంటెవి. అని ఈ మొదలగు విమ
ర్శనశక్తులను జనింపజేసెను. అందుల కులికిపడి దశేంద్రియము
లయందు యుండబడ్డ 72 డెబ్బదిరెండువేల నాడులనే వానరు
లను వెంటనే వచ్చునట్లు నేను శాసించితినని నీవు చెప్పి తో
డ్కొనిరమ్మని శబ్దగుణకమగు సుగ్రీవుడు చెప్పిన స్పర్శగుణ
కమగు వాయుపుత్రుడు వెంటనేజని సుగ్రీవునిఆజ్ఞ అయినది
అని ఊర్ధ్వగతిని త్రిప్పుటయను స్వరముతో బిలచెను. యా
వానరలు ఈ వాయుశక్తి శాసనానుసారముగా అందరు ఏకము
ఖులయి నిలచిరి. అంత విచారణయను లక్ష్మణుడు అంధత్వ
మను కిష్కింధానగరముజొచ్చి అంగములనే అంగదునిజూచి
కోపావేశము జనింప అనేకములగు మాటలాడెను.

అందులకా యంగదుడు నేదియు ననలేక ఇంద్రియాడం
బరముజంపు సూచనజూపెను. అసంగతిలక్ష్మణుడుగ్రహించిఆశబ్ద
గుణకమగు సుగ్రీవుని రావించెను. ఈ సుగ్రీవునకు అవివేకమ
గు మకారవాచ్యమను "రుమ" నామముగల భార్యయు రా
ముని దర్శనలాలన యోగములచే జనించు సంసారతరణమను
తారయను ఇంకొకభార్యయున్ను ఇరువురు భార్యలు గలరు.
ఈ ఇరువురిలో మకారవాచ్యమను రుమను దూరముగానుంచి

తరణమను తారతో తానేగుదెంచెను. పిమ్మట విచారణయను లక్ష్మణునిజూచి, దేవా! మీ యాజ్ఞానువర్తినై డెబ్బదిరెండు వేల నాడులనే వానరసమూహము యేకముఖులయి తమకార్యానువర్తనులై యుండునట్లు నియోగించితిని. అని విన్నవించిన విచారణయను లక్ష్మణుడు సందర్భానుసారముగా ఈ వానరసేనలను జూచి యేమియు ననలేక యూరకుండెను. తాము (లక్ష్మణుడు, శబ్దగుణకమగు సుగ్రీవుడు) ప్రాణనిరోధమను వాయుపుత్రుడు నాడీసమూహమను వానర్లున్ను కలసి ఆత్మారాముని వద్దకు జనుదెంచిరి.

అతడు భ్రూమధ్యమనే గుహాయందు ఒంటరిగానుండి పిమ్మట ఈసేనల నందరిని జూచి తనవశ్యమై యుండిరిగదా యని సంతసించి యోగమను సీతను దెచ్చుటకు సమర్థులని యెంచి వారలతో నిట్లనియెను. ఓ సోదరులారా! మీరలు నాకార్యమునకు సన్నద్ధులై యున్నారు గదా! యని వారలలో వాయుపుత్రునిజూచి ఏకత్వమను అంగుళీయకమును తనయోగమను సీతకు జూపుమని యానవాలిచ్చి పంపెను. అందులకావాయుపుత్రుడు ఆనంద సాగరమున నోలలాడుచు అహాహాభాగ్య మహాభాగ్య మనుచు యీ ఆత్మారాముని ఏకత్వమను కరాంగుళీయకము నాకొసంగుటచే యీయానవాలిచ్చి యోగమగు సీతనుదర్శించుట నాకు లభించును. ననుబోలు ధన్యులుగలరా? ఎందునైనా? అని సంతసించి దక్షిణాభి ముఖముగా స

త్కర్మాచరణమను యితర సేనలతో బయనమాయెను. క్రమ
ముగా సంసార సముద్రముకు చేరువయ్యిరి.

అంత నాసముద్రమును జూచి యిట్లు చింతించిరి. ఆ
హా! ఈసముద్రము దాటుటెట్లు? అనాదియును అపరిమితము
ను అగాధమును గానుండు జన్మములను జలచరముల గలదియు
అటుయిటు అని హద్దుచెప్పుటకు వీలులేనిదియుగాను నుండున
ట్టి సంసార సముద్రమును దాటుటెట్లు? అని చింతించి అటు ఇ
టు జూచుచుండ శాస్త్రచర్చయను యొకగుహ దృష్టమయ్యె
ను. అదిజూచి ఈసంసార సముద్రపుయొడ్డున నిలచి సత్కర్మా
చరణయను చర్చజేయ విశ్రాంతియను దాహము తీర్చుకొన్న
వారై అనగా విశ్రాంతి పొందుటకై శాస్త్రచర్చయను గు
హలో ప్రవేశించిరి. వానిలో ముఖ్యవిషయములను అలంకా
రములతో ముక్తికాంతను గాంచిరి. యాముక్తికాంతయు వీర
లనుజూచి యో మహనీయులారా? ఎటనుండిటకు వచ్చితిరనివా
రిని కుశలమడుగుచు అందులో అంజనీనందనుడగు హనుమంతు
నిజూచి నిర్మలత్వమను పండ్లు పాలు తృప్తిగా పుచ్చుకొనుడు.
అని వారలతో నుడివి అంతరాత్మను దర్శించి అందులయమొం
దెను. పిమ్మట శాస్త్రచర్చయను గుహను విడచి సంసారసము
ద్రమును దాటుటకు ప్రయత్నించుచుండిరి.

అందులో కొందరికి అధైర్యము జనించినందున జన్మము లు అను జలచరములను దాటుటెట్లు? ఇట్టి కార్యము సాధించ కున్నను మనశబ్ద గుణకమను సుగ్రీవుడు మనలను జీవింపజేయు టెట్లు? ఎటుల జూచిన మరణము నిశ్చయమే. సంసార సము ద్రములో బడితిమా? తన్ను మరచి యింద్రియాడంబరమున కు లోబడి చత్తుము. లేక శబ్దగుణకమగు సుగ్రీవుని జేరినరూ ప సంసర్గము లేక బాహ్యమంతయు జచ్చును. గాన ఎటులజూ చినను చావు సత్యమేయని నిశ్చయించి, కొంతకాలము మౌన ముగా నుండిరి. అంత సంపాతి అనగా లెస్సఅయిన మార్గము న కేగుట అను స్వభావముగల వ్యక్తి. ఆసంపాతి (వ్యక్తి) ని శ్చలమను గుహయందుండునదియె ఈ సేనలనందరిని జూచి వీ రలను ఒక్కొక్క వంతున నేతి నేతి వాక్యములచే మ్రింగుదా నని యెంచి మెల్లన సమీపించెను.

నిశ్చలత్వమను సంపాతిని డెబ్బదిరెండువేల నాడులనే వానరులుజూచి, "ఓ దేవా? ఎటనుండిటకు వచ్చిరి. మీ వృం త్తాంతము ఎయ్యది?" అని అడుగగా అందులకియ్యకొని ఆ ని శ్చలతత్వమను సంపాతి తన వృత్తాంతముజెప్ప నారంభించెను. అనేక సంకల్పరాసులే జటగా ధరించిన జటాయువు నాసోదరు డు. అతనితో నేనుగూడి సూర్యనాడీపర్యంతము ఎగిరి వివేక హీనత్వముజేసి తిరిగీ ఉభయులము భూపతనమొందితిమి. అం త నేను చంద్రనాడియను చంద్రరాట్టు జేరితిని.

అతడు నాకుదిస్యతత్త్వము బోధించెను. ఎట్లనగా:—
శ్లో॥ దేహమూల మిదం దుఃఖం, దేహఃకర్మ సముద్భవః। కర్మ
ప్రవర్తతే దేహే అహంబుధ్యాపురుషస్యహి। అహంకారస్త్వ
నాదిస్యా దవిద్యాసంభవోజడః। చిచ్ఛాయయా సదాయుక్త స్త
ప్తాయః పిండవత్సదా। తేనదేహస్య తాదాత్మ్య దేహశ్చేతన
వాన్భవేత్। దేహోఽహమితిబుద్ధిస్యాదాత్మనోఽహంకృతే
ర్బలాత్। తన్మూలఏషసంసారసుఖదుఃఖాదిసాధకః। ఆత్మనో
నిర్వికారస్య మిథ్యా తాదాత్మ్యతస్సదా। దేహోఽహంకర్మక
ర్తాహ మితిసంకల్ప్యసర్వదా। జీవఃకరోతికర్మాణి తత్ఫలైఃభుజ్య
తేవశః। ఊర్ధ్వాఽధోభ్రమ తేనిత్యం పాపపుణ్యాత్మకంస్వయం॥
......శృణుమేపరమంహితం ......(అధ్యాత్మరామాయణం
చూడుడు.)

నిశ్చలత్వమను సంపాతిచంద్రనాడీద్వారా పైతత్వరహ
స్యమును తెలుసుకొనెనని గ్రహించవలెను. అనగా యోగా
భ్యాసముచేయుటచే నిశ్చలత్వమను తత్వరహస్యము తెలియును
గదా? కాబట్టిఅట్టినిశ్చలత్వమేసంపాతియనియును,ఆతత్వరహస్య
మే చంద్రరాట్టనియును, గ్రహించనగును. తదుపరి డెబ్బదిరెం
డువేల నాడులనే వానరులలో ముఖ్యప్రాణశక్తియను వాయు
పుత్రుడు సంపాతియను వ్యక్తిచే తెలియబడు రహస్యములవల
న యోగమను సీతను నారయగలనని నిశ్చయించి సంసారసము
ద్రమును దాటయత్నించెను. లంకయొక్క ఆవరణమెట్టిదన
గా:— చుట్టుప్రక్కల జలతత్వమున్ను మధ్యలంకాప్రదేశము

న్ను గలవు. ఎట్లనగా:— పాదాదియూర్వ్వపర్యంతం యొక ఆ వరణము. నాభిమొదలు శిరఃపర్యంతం యొక ఆవరణము. మధ్య నుండు "లం" పృధ్వీతత్వమే లంక యనబడును. అట్టిలంకయందుండు అభిమానతత్వమే రావణుడనియును, అట్టి రావణుని సంహరించుటకు కుండలినీశక్తిని పెకలించి పరతత్వమందు చేర్చువాడు వాయుపుత్రుడు. గానయీవాయుపుత్రుడులంకలో ప్రవేశించి రావణుని వంచించి యోగమను సీతను తెచ్చుటకు నుద్యుక్తుడై బయలువెడలెను.

ఆసమయములో ఇంద్రియాధిష్టాతలను దేవతలు కొన్ని విఘ్నములు చేయనెంచి బలము చాలునా చాలదాయని యెంచి వ్యామోహమను సురసను నంపిరి. యామె వ్యాపకశక్తిగలది గావున వీని యేకత్వదృష్టిని భిన్నముచేయనెంచి తనముఖగహ్వారమున ప్రవేశించుమని పరిపరివిధములకోరెను. ఓం తత్ సత్

గద్య:—ఇతిశ్రీమత్ కూరెళ్లవంశక్షీర పయోధిసముత్తారక శ్రీనృశింహాభిధాన రూప నారాయణ చరణ సేవాపరాయణ శ్రీ కామేశ్వరీ లక్ష్మీదేవీ రచితాంతరార్థ రామాయణ రూప బ్రహ్మవిద్యయందు చతుర్థ సాధనమను కిష్కింధాకాండము సమాప్తము.

# అంతరార్ధ రామాయణము

## పంచమ సాధనము

### సుందరకాండము ప్రారంభము.

అందులకాముఖ్యప్రాణశక్తియను వాయుపుత్రుడు విషయమును పరిశోధించి విడుచుట మంచిదిగదాయని యెంచి యాముఖమున అనగా వ్యామోహమను సురసముఖమునందు ప్రవేశించి గొప్ప విచారణమను మహారూపమును ధరించెను. పిమ్మట ఆయాంజనేయుడు వ్యామోహమను సురస విపరీతరూపములుబూనినందులకు భ్రాంతినొందక దృష్టాంతమను గొప్ప రూపము నొందెను. పిమ్మట దాని నణగద్రొక్క సెంచినందులకు యావ్యామోహమను సురస యొడంబడక శాస్త్రవిరుద్ధములగు కొన్ని దృష్టాంతములనే రూపము ధరించెను. అందులకావాయుపుత్రుడు ఆపాదమస్తకము పరతత్వరూపముచే వ్యాపించి యాసురసను (వ్యామోహమును) నణగద్రొక్కెను.

అప్పుడు అధిష్టానదేవతానీకము అత్యానందమగ్నమానసులై ప్రకృతకార్యములకు సహాయమొనర్చిరి. పిమ్మట బింబప్రతిబింబమను మైనాకుని దర్శించి ప్రతిబింబవాదమును నిర్మూలము చేసెను, తదుపరి లం పృథ్వీతత్వమను లంకలోప్రవేశించి అచ్చట దృశ్యమను లంకిణిసి ఏకత్వవిచారణయను ముష్టి

చే సంహరించెను. పిమ్మట సూక్ష్మరూపము ధరించి యావా
యుపుత్రుడు లకారవాచ్యమగు లంకయందుండబడు విషయవా
సనలనే ప్రదేశముల పర్యటించుచు యోగమను సీతను గాం
చుటకు యత్నించెను. గాని ప్రయత్నము విఫలమయ్యెను.
అంత బాహ్యమను క్రీడావనముజొచ్చి (శోకం, నాస్తి ఇతి= అ
శోకం) అను అశోకవృక్షము నధిష్టించెను.

అంతట అహంకారమను రావణుడు తన దుర్బుద్ధినిగు
రించి తాను వితర్కించుకొని "నేను యీ సీతను పొందుట క
ల్ల అని నిశ్చయించి మరియు దురహంకారముండినందునగదా
ఎట్టి కార్యములు సాధించబడును. అట్లుకానిచో యీ యోగ
మును తెలుపు వారెవరు? పొందువారెవరు? గాన నేను మర్త్య
ను (సీతను) ఏల కోరవలయును". అని యీ మొదలగు కుత
ర్కములు జేయుచు యీ యోగమను సీతను పొందనెంచి త
న దశేంద్రియములు దశశిరములుగా ధరించి నీలజీమూతమగు
తమోగుణమే రూపముగా ధరించి నీతికోవిదుల తిరస్కారమే
కిరీటముగా నమర్చుకొని వింశతితత్వములే భుజములుగా గలవా
డై అద్వితీయతత్వము తెలియనేరక అఖండానంద యోగమను
సీతను పొందగోరి బయలువెడలెను.

పిమ్మటఅశోకవనికా వృక్షమునందు వసించియున్న వాయు
నందనుని, ఆమూలనుండు యోగమను సీతను, గాంచెను. సా

ధనచతుష్టయసంపత్తి అభ్యసింపనేరక దారేషణ, పుత్రేషణ, ధనేషణ, యను ఈషనాదులతో తర్జనభర్జనాదులచే యాయోగమను సీతను తన్ను పొందుమని కోరెను. అందుకాయోగమను సీత వకతృణమునుజూపి, ఓరి, మూర్ఖా! ఇది జూచితివా? నీచే స్వీకరింపబడు సర్వవిషయములు నేను తృణప్రాయముగా నెంచితినని నీవెపుడుదలంచెదవో అపుడుగాని నీవు నన్నెరుగవు. అంత దనుకజిజ్ఞాసతో నుండుము. ఆజిజ్ఞాసాబలమున అద్వితీయుడనే రాముడు నీకు ప్రసన్నమై వేలకొలది నీకుండబడు దుష్టపరివారమును సంహరించి, నీదశశిరములను దశేంద్రియములు బరిమార్చి, నీయందున్న ప్రణవమే భేరీనాదముగా నొనర్చి, నిన్ను జంపగలడు. నీమూఢత్వ ముపసంహరించుకొనుము. అని దృఢముగా ఆసీతపలికినపైని, యారావణుడు క్రోధతామ్రాక్షుడై తన కరవాలముచే బెదరించ, నపుడు మండోదరి మొదలగు స్త్రీరత్నములు వారించి, నీవీరత్వముకు అనాథయగు స్త్రీనిచంపుట యుచితముకాదు. అని శాంతింపజేయ, దుర్గుణములనే రాక్షసాంగనలతో, యీమెను తర్జనభర్జనాదులతో తనవైపు తిరుగునటుల బోధింపుడు- అట్లు విననిచో రెండుమాసములు లోపున ఈతనువు భక్షింపుడని యాఅహంకారమనే రావణుడు క్రూరముగాబలికి, తన అంతఃపురమున కేగెను.

పిమ్మట ఆరాక్షసాంగనలు బాధింపజొచ్చిరి. రెండు మాసములు అనగా జ్ఞానాజ్ఞానములే ద్వంద్వసమయము గావు

న యీలోపున యీ యోగమను సీతను బరిమార్చబడు వస్తు వుగా అనుకొని ఆరావణుడాజ్ఞాపించెను. అంత దుర్గుణములను రాక్షసాంగనలు యోగమను సీతవంక జూచి మాయేలికయగు రావణుని పొందుమని పలువిధముల బాధించిరి. అంతలో త్రి జట (అధ్యాత్మికాది తాపత్రియసంకల్పఫలములనెడు జడలను ధరించునది గావున త్రిజట.) ఈదుష్టులనుజూచి, ఓ దురాత్ము లారా? శ్లో॥ నాసతోవిద్యతేభావో నాభావోవిద్యతేసతః। (భ గవద్గీత) అనునట్లు ఈమె (సీత) యప్పటకి నశించునదికాదు. మీయేలికయగు రావణుడు నశించువాడేయని బలికిన యాదు ష్టాంగనలు తూష్ణీకారమొందిరి. అనగా:— శ్లో॥ మనఏవ మ నుష్యాణాంకారణం బంధమోక్షయోః॥ అను శృతివచన ప్రకా రం బలముహెచ్చుగా యేపక్కనుండినయాపక్క కొరుగుట, గుణమునకు స్వభావము. గావున నందుచే ఈదుష్టాంగనలు(దు ర్గుణములు) తూష్ణింభావమొందిరి. అంత వాయునందనుడు సీతనుజూచెను. జూచి తన స్వాగతమున ఈమెకు తన నిజతత్వ ము దెలుపుట ఎట్లని యోజించి పిమ్మట ఇట్లుపలికెను.

"దేహమను అయోధ్యానగరము పాలించు జీవుడను ద శరధునకు అంతరాత్మయను రాముడు, ఆయాత్మను తెలుసు కొను శక్తియే లక్ష్మణుడు, అవిద్యాశక్తులు భరత శత్రు ఘ్నులు, నలువురు పుత్రులు గలరు. అందులో జ్యేష్టుడగు నారామునకు యోగమను సీత అతని అర్థాంగిగా

నుండెను. సీతా రామ లక్ష్మణులు ముప్వారు కల
సి పితాజ్ఞానుసారముగా సర్వగుణాతీతమను నరణ్యమున జొ
చ్చి గ్రిమ్మరుచుండ నిశ్చలానంద యోగమను సీతను అహం
కారమను రావణుడపహరించెను. పిమ్మట ఆరామలక్ష్మణులిరువు
రును ఆమె గనబడనందులకు అరణ్యప్రదేశములన్నియు శోధిం
చి యెందునను గానలేక కృపియను ఋష్యమూకాద్రిపర్వత
సమీపమునకు జేరిరి. అచ్చట శబ్దగుణకమను సుగ్రీవుడును, వా
యుతత్త్వమను నేనును, అధఃపతనమను వాలియొక్క దుర్ఘట
నముల కోర్వజాలక ఆపర్వతాగ్రమున మరికొంత పరివారము
తోకూడా నుంటిమి. అంతట ఈపర్వతసమీపమున నైర్మల్య
మను సరోవరము ఉన్నందున ఆగట్టుననుండు ఈ తేజఃపుంజము
ల వీక్షించి వారియొద్దకు నేనస్ఖలితుడనై అనగా చలనరా
హిత్యమనే రూపముతో దర్శించితిని. అంత వారితో కొంత
సంభాషణమొనర్చి, పిమ్మట అధోర్ధ్వశ్వాసలను ధరించుకొని
వారిని యాపర్వతమునందుంచితిని.

అంతట శబ్దతత్త్వమను సుగ్రీవునకున్ను ఆరామునకు
న్ను సఖ్యమైనది. తదుపరి అధఃపతనమను వాలిని సంహరించి
వానిచే పాలింపబడు రాజ్యములో లోకసంగ్రహార్థమను ముఖ్య
ప్రదేశమును పట్నంబుగాగట్టి, తరణమను తారను సుగ్రీవునకొ
నగూర్చి, పిమ్మట కొన్ని స్థితులు గడచినతర్వాత పితృయాన
మను ఈదిశను రావణుండుండుట యెరిగి అనగా దక్షిణదిశను

పాలించువాడుగా దెలసి సీతను గనుగొనుటకై యీదిక్కునకుం బనుమని నాకాజ్ఞాపించిరి. అనేకజన్మపరంపరదుఃఖరాసులుగల యీసంసారసముద్రము మెల్లమెల్లగా "సోహం" అను రాముని కరాంగుళీకసహాయముచే దాటితిని. దాటి లంకలోజొచ్చి అశోకావనమను కుండలినీశక్తిని పెకలించి యీయోగమను సీతను గాంచితిని. ఆహా! ననుబోలుధన్యుడెందైననుగలడా? ననుబోలుశుచియు సుఖియు నెందున లేరని సంతసించుచుండ యీయోగమను సీత అనన్యమగు నారాముని చరితామృతము నావీనులవిందుగ గ్రోలితిని. యెటజూచినను బాహ్యాడంబరములే వోలలాడుచుండ నిత్యాత్మయగు రామునిచరితమిందు వుండుటకు పీలుచిక్కదె. గాన యిట్టి అఖండానందము గ్రోలుటకు శక్తి ఎట్లు గలిగెనో? ఇది ప్రత్యక్షమా? లేక స్వప్నవార్తయా? ప్రత్యక్షమైనచో నాకన్నులకు గోచరించునట్లు గనుబడిన నేనమ్ముదును. లేకున్న ఆకస్మికముగా గలుగు యెంతఅఖండమయిన వాక్యమైనను నిలువదుగదా? గాన నాయెదుటకు రండు. అని పలుమారుపలుకుచుండ నావాయుపుత్రుడు సర్వేంద్రియముల యందుండు ప్రాణశక్తియే గావున చైతన్యాత్మగా గనుబడియె. అంత యీయోగమను సీత కర్తృత్వఅహంకారాదిశక్తులు రావణమాయలేకదా? అని యెంచి మిన్నకుండెను.

అందులకావాయుపుత్రుడు వోర్వలేక, మాతా! నన్ను మాయకునిగా జూడకుము. ఇంద్రియములు ఉండునపుడు ఉం

డువాడను. లేనియపుడుకూడా యుండువాడనే. గాన సర్వేం ద్రియములు అను ఈరాక్షసశక్తులు నాకు వశమైయుండునవి. నేను వాటినిమించి స్వస్వరూపమగు ఆత్మారామునివరకు యుం డువాడ. గాన నన్ను రామబంటునిగా నెన్నిమన్నింపుమమ్మా! అని ప్రార్థించెను. ఈప్రార్థనలకాయోగమను సీత ఇంచుకయు చలింపక యూరకుండెను. ఆవాయునందనుడు చేయునదియు యేమియులేక "సోహం, సోహం" అను రామనామాంకితము గల ముద్రికను ఆయోగమను సీతకిచ్చి మౌనముగా నుండెను. "సోహం" అను ఆరాముని ముద్రికనుజూచి స్వరూపమునందు లయమునొంది, కొండొకసేపునకు మేల్కాంచి ఎదుటనున్న యా వాయునందనునిజూచి, యోపుత్రికా! విచారణయను లక్ష్మ ణుని మరచుటలేదు. నాయాత్మారామునియందే సదా ఉండు దానను. ఆహా! ఇన్నాళ్లకుగదా! దుర్వాసనలను రాక్షసులను సంహరించి కుండలినీశక్తిని పెకలించి నన్నుగాంచి, "సోహం" అను కరాంగుళీయకము నాకిచ్చి ప్రాణదానముచేసితివి. నిన్ను బోలు ముఖ్యులెందైనను గలరా? అని సంతసించి పిమ్మట యా వాయునందనునితో యాసీత యిట్లుపలికెను.

"బిడ్డా! నీకు రామసాహాయ్యము లేనిదే బాహ్యాడంబ రులను రాక్షసులు నిన్ను చాలాచిక్కులు పెట్టుదురు. నీవు చంపినను మరల పుట్టగలరు. గాన వారలను నీవు నిర్మూలమొనం దించుటకు ఆయాత్మారాముని తోడ్కొని, యావారధి దాటిం

చి లంకయందుగల రావణాదులను సంహరించి, నన్ను ఆత్మా రామునియందు జేరునట్లు జేయుము. ఇట్లుచేయుట ఈకార్య మునకు సాధ్యసాధనములగును.* అని యోగమను సీత పలికిన ఆవాయుపుత్రుడు స్వగతమున శ్లో॥ యథాసర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే। సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోప లిప్యతే॥ భగవద్గీత॥ అనునట్లు యీఅంతరాత్మయను రాముడు అంతటానుండియు నుండనివాడు. నేనారాముని సహాయముచే సర్వోపాధులకు రాకపోకలు గలిగించువాడను. ఆకారణముచే నేను వేరువాడను నెట్లగుదును? నాయొక్కరూపము సంపూర్ణ ముగా జూపినగాని ఈమె నమ్మునట్లు గనబడదు. అని నిశ్చ యించి బాహ్యముగా, అమ్మా? ఆకాశము తర్వాతగలుగు వా యుతత్త్వమను నేను నారూపము జూపెదను. అని ఆధారాది చక్రములు దాటి వియన్మండల తారామండల జ్యోతిర్మయ మండల ధృవమండలములను గడచి చిత్తాకాశ చిదాకాశముల ను దాటి కేవల తత్త్వాకాశమువరకు పెరిగెను.

అట్టి నిజరూపమును యీయోగమను సీతజూచి యీవా యుపుత్రునియందు గాఢానురాగముకలదియై పుత్రవాత్సల్య ముతో, నాతనయా? యింక నీరూపమునుపసంహరించుకొను ము. నీనిజరూపము నాకు తెలిసినది; సంతసించితిని. ఇక కా ర్యభారమంతయు నీయందు ఆధారపడియుండుటకు వెరపులేదు; అని సీత నుడివిన పలుకులకచ్చెరువొంది పాణిపాదములు కద

ల్పురూపము ధరించెను. అనగా చిన్నరూపమును ధరించెను. తదుపరి యాయమవంకజూచి,యోజననీ? యెక్కువ బుభుక్షగల వాడనై యున్నాను. ఈఅరణ్యమున దుష్కర్మసంహారమను యొకఫలమును భుజింపగోరియున్నాను. అందులకనుజ్ఞనొసంగు మని యావాయుపుత్రుడు ప్రార్ధించెను. ఏకత్వమను నొక్కఫలమును పుచ్చుకొనుము. పిమ్మట యాత్మారాముని గలసుకొని శేషకార్యము సాధించుము. అని యాసీత అనుజ్ఞ యిచ్చిన పైని వల్లెయని సెలవునందుకొని, "లం" పృధ్వీతత్వమను లంకయందుగల నామరూపాదుల వేళ్లసహితముగా అనేకవృక్షములను పెగల్చి అందులకాశ్రయులగు అభిమానులంబరిమార్చి అందులకడ్డమువచ్చునందరిని సంహరింపజొచ్చెను.

ఇదియిట్లుండ దుర్విషయాదులనే రాక్షసాంగనలు ఆరావణునివద్దకుజని యవడో మేముండుటకు తావిసుమంతైనను లేకుండ జేయుచున్నాడు. ఆదురాత్ముని పోల్చుటకు మాకశక్యమయ్యెను. మాయేలికవు నీవుగాన మమ్మురక్షింపుమని ప్రార్ధించిరి. అంతట అహంకారమను రావణుడు క్రోధమూర్చ్ఛాపరవశుడై ఆహా? ఎవడు ఈదురాత్ముడు. సృష్టిమొదలు నేటివరకు నాచే ఆర్జింపబడిన అనేకవేలదురితములు పాలించుచుండ, సృష్టికిలోబడు ఎట్టివారలు నన్ను ఏమియుజేయలేక యూరకొనియుండగా, నాబిడ్డలకు నిలువతావైనను లేక చేయువాడెవడో వానినే నిప్పుడేబోయి యమసదనమున కంపెదను. అని చలి

తేంద్రియుడై క్రోధావేశముతో తన అక్షయకుమారుని రా వించి, ఓ కుమారా! మనలను తెగటార్చుటకు మహావీరుడై ఒకానొకడున్నాడట. నీవచటకేగి వానినొకచూపుతో సంహ రించిరమ్ము. అని రావణుడనిన మాటలకంగీకరించి తన చూ పులశక్తి నాయక్షయకుమారుడు ప్రయోగించెను.

ఈవాయుపుత్రుడు అతి తీవ్రముగానుండువాడు గావున ఆఅక్షయకుమారుని యొక్క చూపు వేడిమిని క్షయమొందించె ను. అనగా వానినికూడా సంహరించెను. ఆవార్త అహంకా రమను రావణుడువిని యిట్టి శ్రేష్ఠమగు నాయొక్క శక్తులన్ని యు సంహరింపబడిన నేనేమిజేయువాడనని దుఃఖపరవశములో నుండుతరిని, ఇంద్రజిత్తు అను గొప్పబలాఢ్యుడు (అనగా ఇం ద్రియులకు యొనర్చుబడు హోమదానపూజాదులు విడచి త న దేహామునే పోషించుకొను యేమూడబుద్ధిగలదో అట్టి మూ డబుద్ధి ఇంద్రజిత్తని చెప్పబడినది.) ఈఅహంకారమనే తండ్రి నోదార్చి ఓ పితా! నీవు విచారసాగరమున మునగకుము. నేని ప్పుడేబోయి యీవానరుని బంధించి నీసమక్షమున నుంచువా డను. అని ధైర్యముగా నుడివి తండ్రిని సమాధానపరచి తా ను బయలువెడలెను. అంత తానుజని యీముఖ్యప్రాణశక్తియ ను హనుమంతునిజూచి యిచ్చట ఈకార్యము జేయకతీరదని వ కదురభిమానం యీవాయునందునునిపై ప్రయోగించెను. అం తమాత్రమున కతడు లోబడుటలేదు. గాని అయినను ఎట్లకే

లకు అది నిర్బంధకార్యమని తోచునట్లు మోహితుడై ఆ కార్య మునకు అనగా మోహపాశమునకు చిక్కుపడిరెను.

ఆకట్టుబడియున్న ముఖ్యప్రాణశక్తిని బాహ్యేంద్రియ ములయందు కర్తృత్వభోక్తృత్వాదిగుణములగల అహంకారు ని అనగా రావణునియెదుట నిలువబెట్టెను. అంతట ఎదుటను న్న బాహ్యప్రాణమను వాయునందనునిజూచి, యోరీ, తులు వా? నాసంబంధమగు శక్తులనన్నింటిని సంహరించి నీవు వంటరి గా మెలగుచుందువా? కానిమ్ము; నాయింద్రియాదులనే పరి వారము నేను కలసి నిన్ను క్షోభాయమానము నొందించకమా నను; అని దృఢముగా అహంకారమను రావణుడుడివెను. ఆవా క్యములకావాయునందనుడు యోరీరావణా! నీవు పౌలస్త్యబ్రి హ్మవంశసంజాతుడవు. ఉత్తమబ్రహ్మకులమున జనించినవాడ వు. అట్టివాడవయ్యు ఇంద్రియాదులకేల లోబడి నాది, నేను అ ని పలుమారుపలికితివి. గాని యాపలుకులెరిగి పలికితివా, యె రుగక పలికితివా, ఎరిగిపలికినచో నీకొక పదార్థమేలేదు. ఎరు గకపలికినదంతయు నజ్ఞానమే యగును. గాన నీనెవరో ముఖ్య ముగ దెలసుకొనుము. నీచే తెలియబడు జగజ్జాలమంతయు నీ వే యగుచున్నావు. అని ఈరీతిగా ఆప్రాణశక్తియను అంజనే యునిచే అహంకారమను రావణుడు బోధితుడైయుండు సమ యములో ఇంద్రియాదులు సన్న సన్నముగా దేహవాసనామ యముగా జేసెను.

అట్టి వ్యామోహాముచే ఇది ప్రాణశక్తియని తెలియనేరక యేదోయొకవ్యక్తియని నెన్నుకొని ఆవాయునందనునివంక జూచి, హోరితులువా! నీవు నాకు గురునివలె బోధించుచున్నావు. ఈమాత్రబోధకే నేను లొంగువాడనుగాను. దేహేంద్రియములు నావియని నేను పరిపాలించుచుండగా నాబలమును తెలియనేరక నీవేల యిట్టి మహావాక్యములు బోధించెదవు. నాకూ్రరత్వము తెలసి తెలియనేరక బోధించుచుంటివి గాన నిన్ను సంహరింపకమానను అని తన అహంకారకాంతి అను ఆయుధముచే బెదరించెను. అప్పుడు శుద్ధసత్వప్రధానమను విభీషణుడు ఐహికమునకు ఆముష్మికమునకు ప్రధానమగు అహంకారమను రావణునితో అసగా తన అన్నగారితో, యోసోదరా! "యీప్రాణశక్తియను వానరుని సంహారించిన, పైవిషయము మనకు తెలియదు. ఇచ్చటనుండు సంగతి యాపరతత్వమను రామునకు దెలుపుటయు అచ్చటనుండు విషయము మనకు బోధించుటయు యిట్టికార్యములకు సమర్ధతగల వీనిని సంహారించుట ఉచితముగాదు" అని బోధించినపైని ఉలికిపడి, ఓ విభీషణా! (విభీషణ=వి+భీ+యీషణ=విగతాః, భీశ్చ, ఈషణాశ్చ, యస్యసః=విభీషణః. అతఏవ శుద్ధసత్వావాచ్యం) రామునియందే నిలచి యుంటివి. నాచే సర్వేంద్రియభోగములు యింతదనుక అనుభవించి ఇపుడాపరునియందు గలయనెలచితివి.

అందుచే నాకు శతు్రడవుకాని మితు్రడవుకావు. నా

యాస్థానమందుండక వెడలిపొమ్ము. అని కూ్రరముగా బలికి
న ఆవాక్యములకు శుద్ధసత్వమను విభీషణుడు యలుకజెందక రా
మునియందే జేరెను. పిమ్మట యావాయువందనునకు అహం
కారమను రావణుడు అగ్నిసంబంధమగు నొకశిక్షవిధించి, యో
పరిజనులారా? (ఇంద్రియాదులారా?) ఇతని వాలమునకు మన
ఇంటనుండు వస్త్రములన్నియు బంధించి అగ్ని సంస్కరింపుడు;
అనిన ఆపరివారము అట్లుగావించిరి. పిమ్మట స్పందనశక్తిగల
యాముఖ్యప్రాణమను వాయునందనుడు వైరాగ్యమనే వాయు
సాహాయ్యముచే స్థూలోపాధులనే సర్వగృహములను దగ్ధము
గావించెను. అప్పుడాయోగాగ్నికి, అందుండు దుష్టపరివారము
సహింపజాలక రోదనములు గావించిరి.

ఆయోగాగ్ని సర్వమును భస్మీకృతమునుజేసి యాయో
గమను సీతను దర్శించి యామె యాజ్ఞవడసి అధోగతిగానుండు
విషయములను క్రమక్రమముగా నన్నియు ఊర్ధ్వతత్వమునం
దుండునట్లు ప్రజ్ఞగలుగజేసి అనగా తనవశమునందుంచుకొని తి
రిగీ ఆపరతత్వమను రాముని గలసుకొనుటకు కుప్పించి ఉప్పరము
పొడవువగసి ఛిణిఛిణి మొదలగు గొప్ప నాదముగావించెను.
ఈనాదము శాశ్వతసుఖనాదమని జయప్రదమని యిచ్చట బా
హ్యామునసుండబడు , డెబ్బదిరెండువేల నాడులను వానరులు సు
ఖముగ విశ్రాంతినొందిరి. ఆవాయునందనుడు అంబరవీధినుండి
క్రమక్రమముగా నాశికాద్వారములవెంబడి బయటకువచ్చి వీ
ర్లను కలసుకొనెను.

అంత ఆనాడీసమూహామను యావానరులందరుగలసి నరిదనవనముజొచ్చి ప్రారబ్ధమను దధిముఖుని నోడించి యావనమునసుండు మహావాక్యములనే మధువునుగ్రోలి పిమ్మట ఆత్మారాముని (రాముని) దర్శించిరి. అచ్చట శబ్దతత్త్వమను సుగ్రీవుడు వీరి జయప్రదసూచనములకు సంతసించి యావాయునందనుని కౌగిలజేర్చుకుని అచ్చట జరుగుకార్యములన్నియు సవిస్తరముగా వానివలనదెలసుకుని అత్యానందసాగరమున మునిగెను. ఆరాముడుకూడా వీని సామర్థ్యముకు సంతసించి ఓ వానరులారా! పైకార్యమునకు సిద్ధముగనుండవలెను. ఇందులో మన ముఖ్యప్రాణశక్తియగు వాయునందనునిచే సర్వకార్యములు సాధించబడెను. అని నుడివి ప్రాణశక్తిని తన వశేమునసుంచుకొని పైకార్యములను కొనసాగించి జయమొందుటకు నుద్యుక్తుడై యుండెను. ఓం, తత్, సత్.

గద్య:—ఇతి శ్రీమత్ కూరెళ్లవంశక్షీర పయోధిసము
త్తారక శ్రీనృశింహాభిధాన రూప నారాయణ
చరణ సేవాపరాయణ శ్రీ కామేశ్వరీ
లక్ష్మీదేవీ రచితాంతరార్థ రా
మాయణ రూప బ్రహ్మ
వి ద్య యం దు
పంచమ
సాధనమను సుందరకాండము
సమాప్తము.

# అంతరార్థ రామాయణము

## షష్టమసాధనమను

### యుద్ధకాండము ప్రారంభము.

రావణసంబంధమయిన సర్వస్థూలోపాధులయం దుండే బడు అభిమానము ఈ ముఖ్యప్రాణశక్తిచే నొనరింపబడు యోగాగ్నిచే దగ్ధమగుటచూచి, యారావణుడు యోర్వలేక తనముఖ్యపరివారముచే కొలువుతీర్చి యుండుసమయములో కుంభకర్ణుడు (కుంభకర్ణః=కుంభౌ, ఇవకర్ణౌ, యస్య, ఇతి అనేన ఔపచారికార్థః వక్తవ్యః- యథాకర్ణౌ ఇత్యనేన శృతి స్మృతీ గృహ్యేతే; స్మృతిః; శృత్యనుసారిణీతి హేతోః- శృతి, స్మృతీ కుంభస్థ నిక్షేపధనవత్ నిష్ఫలతయా, శృతి, స్మృతీ, అస్మిన్ విద్యేతే, ఇతి కుంభకర్ణః) అనేక శృతిస్మృతులు వినియు వానిప్రకారం ఆచరించనివాడు అట్టికుంభకర్ణుడు అన్నవంకజూచి కొన్నినీతులు చెప్పనారంభించెను. దేవా! తమరు అహంకార స్వరూపులు, ఆరాముడు సాక్షిస్వరూపుడు. మీరు విషయములు కోరువారు. మీచే, తేబడిన ఆ యోగమను సీత మిమ్మునుపొందునదికాదు.

గాన సాక్షిస్వరూపుడగు రామునకు సీత నర్పించి మీరు నిరుపాధికు లగుట శ్రేష్టము. అని నుడివిన కుంభకర్ణవచన

ముల కులికిపడి రావణుడు, ఓదురాత్మా? నీ వెప్పుడూ నిదు
రచే బాధితుడవగుచు యుక్తాయుక్తము లెరుంగక యుండువా
డవు. నాచే అనేకజన్మములనుండియు నార్జింపఁబడిన దేహాభి
మానమను ధనరాసుల ననుభవించి నన్నిప్పు డెదిరించుచుంటి
వి. ఛీ? దురాత్మా? నీ నిద్రావాటికకు పొమ్ము అనిచెప్పి ఆ
యహంకారమను రావణుడు నేమియుతోఁచక మత్తుగొని యూ
రకుండెను. అంత శుద్ధసత్వప్రధానమను విభీషణుడు లేచి,
యారావణుని వంకజూచి, యోదేవా? మీరు కించిత్ ఉపాధి
గలవారు- ఆరాముడు సర్వోపాధిస్థుడు అతడు అమాయకుడు -
మీరు సమాయకులు. అతడు స్వప్రకాశుడు గాన అతనితో
వాదమునకు సమకట్టుట, అతని సహచారిణి యగు యానంద
యోగమను సీతను అపహరించుట, యుచితముకాదు.

గావున యామాతను వారికి సమర్పించి మీరా తేజము
నందు లీనమగుట యుచితమని బలికెను. యానుడువులు యా
రావణుని వీనులకు ములుకులుగాతోఁచి వేడిచూపులతో, ఓదు
రాత్మా? నా యెదుట నిలువకుము. ఇంతకాలము నాతోఁ చేరి
నాసంబంధమయిన విషయములన్నియు ననుభవించి నన్నిపు
డెదిరించుచుంటివి. నీవు నాయందెంతమాత్రము నిలువలేవు.
అని దృఢముగా పలికిన అందులకా శుద్ధసత్వప్రధానమను విభీ
షణుడు తన సాధనచతుష్టయమను నలువురమంత్రులతో అద్వి
తీయుడగు రాముని శరణుపొందుటకై యేగి అంబరమున నిల

చెను. అచటనుండి రామునిగని, ఓ నిరుపాధికా! నిరాశ్రయా! నేను రావణానుజుడను. మిమ్ములను శరణుజొచ్చితిని, అని విభీషణుడు పలికినపైని శబ్దతత్వమను సుగ్రీవుడు రామునింజూచి ఓ దేవా! వీరిని నమ్మగూడదు. ఒక కాలమున మంచిగా ఉండినను, మాయామయు లగుటచే దేహవాసనయను అహంకారము జనింపక మానదు. దేహాభిమానముచే వక కాలమున మంచిగాఉండినను రెండవ కాలమున దేహవాసన రాకమానదు గావున ఇట్టిమూఢులకు తావుయియ్యకూడదు అనిన యారాముడు, ఓసుగ్రీవా! నాయందు జనించిన యాశుద్ధసత్వప్రధానమను విభీషణుడు కొంతకాలము రావణుని (అహంకారుని) యొద్దకుజేరెను. గాన ఇప్పుడు ఈశుద్ధసత్వమను విభీషణునివల్లను ఇతని సాధనచతుష్టయమను మంత్రులవల్లను కార్యము సాధించబడును. అనగా ఆ యహంకారమను రావణునిజూపుటకు ముఖ్యపరివారములు వీరలే! గాన వీరలను తోడ్కొనిరమ్మని శరణాగతవత్సలుడగు ఆరాముడు పలికినపైని శబ్దమను సుగ్రీవుడు యేమియుననలేక వారలను తోడ్కొనివచ్చెను.

పిమ్మట శుద్ధసత్వప్రధానమను విభీషణుని, సాధనచతుష్టయమను అతని మంత్రిపరివారమును రాముని పరివారమందరు గలసుకుని వీరలుండినగాని యీదురహంకారుడను రావణుడు జచ్చుటయెట్లు? అని వారిని కొనియాడుచుండిరి. అంత వి

వారణయను లక్ష్మణుడు యావిభీషణునిజూచి, అహంకారము
ను యారావణుని జంపుటకు నీవు మరవు విసుపులేక తోడుపడ
వలయును. అని "శృ॥ సత్యత్వేనజగద్భానం, సంసారస్యప్రవ
ర్తకం। అసత్యత్వేనభానంతు, సంసారస్యనివర్తకం॥" అను శృతి
వచనప్రకారం యాశుద్ధసత్వప్రధానమను విభీషణునకు అహం
అహం అను అహంకారమనే రావణునిచేపరిపాలించబడు ఈస
ర్వము బ్రహ్మమేయను సర్వరహస్యోచితమహాధనమంతయు యి
తనికి బట్టముగా గట్టెదనని యారాముడు దృఢముగాబలికి, వి
చారణమను లక్ష్మణునిచే తేబడు నిర్మలోదకముతో విభీషణు
నకు బట్టముగట్టెను.

అంత అంతరాత్మయగు రాముడు విచారమున శబ్దత
త్త్వమగు సుగ్రీవునితో యోసుగ్రీవా? అహంకారమను రావ
ణునియొద్దవున్న సీతనుజూచి, రావణువివంచించి, తిరిగీ స్వస్థత
నొందుటకు, యెన్నిశ్రమలుబడవలయునో అన్నియు ముఖ్య
ప్రాణశక్తియగు మన వాయునందనునిచే చేయవలసిన నంతప
నియు చేయబడెను. ఇటుపయిని జాగరూకులమై కార్యము సా
ధించుటకై అందరము సన్నద్ధులమై యుండవలెననియెను. పి
మ్మట వాయునందనునిగాంచి యోపుత్రా? నీసంబంధమగు(72)
డెబ్బదిరెండువేల నాడులసమూహమను వానర సేనలను సిద్ధపర
చుము. యోసుగ్రీవా? నీసంబంధమగు తపోగ్నిని ప్రజ్వలింప
జేసి అందరిని పురికొల్పుము. మనము ఈవానర సేనల సహాయ

మున సంసారసముద్రమను (కామక్రోధాదిముద్రాభిః సహి
తః సముద్రః) సేతువును బంధించి లంకలోప్రవేశించి దుర్గుణ
ములనే రాక్షసులసందరిని బరిమార్చి పిమ్మట యోగమను సీ
తను గొనిరావలెను. అని నిశ్చయించి అందరునూ శాస్త్రోన్ము
ఖులై సంసారసముద్రమును సమీపించిరి.

ఆ సంసారసముద్రము లో నున్నపుడు జలచరములూ నీ
టిపైకి తేలుచు లోనికిమునుగుచు అనేకలీలలుగా నటించుచుం
డెను. ఆ జలచరములేవియనగా:— "శ్రు॥ కామక్రోధం భ
యంచాపిలోభ మోహామదోరజః। జన్మమృత్యుశ్చకార్పణ్యం
శోక స్తంద్రిక్షుధాతృషా।తృష్ణాలజ్జాభయందుఃఖం విషాదో హ
ర్షఏవచ। ఏభిదోషైర్వినిర్ముక్తః సజీవః కేవలోమతః॥ యోగ
తత్త్వోపనిషత్ ॥" అనునట్లు ఈవిధమయిన జలచరములతో
కూడుకొనియుండు ఈసంసారసముద్రమును వీక్షించి, ఎట్లుదీని
ని గట్టుటయని యోజించి విచారణశక్తియను ఆగ్నేయాస్త్ర
ము యాసముద్రుని (సంసారమను సముద్రము) పై ప్రయో
గించెను. ఈ బాణాగ్నిని ఆసముద్రుడు యోర్వలేక దైవసంప
త్తు, అసురసంపత్తు అను రెండుబాటలు గావించి, యాఅంతరా
త్మయనే రామునిసందర్శించి, యో దేవాదిదేవా! ఇది వీక్షిం
పుము. నాప్రవాహకార్యము రెండువిధములుగా గావించితిని.
అనగా దైవసంపత్తు. అసురసంపత్తుఅని రెండువిధములు. ఇం
దులో దక్షిణాయన మార్గమునబోవువారు అసురసంపత్తనియు

ను, ఉత్తరాయణ మార్గమునబోవువారు దైవసంపత్తుఅనియును ద్వివిధమార్గము లొనర్చితిని. అందు దైవసంపత్తుగల నీసేనల తో ఈసేతువును బంధించి కార్యము సాధించుకొనుము. అని నుడివి యాసముద్రుడు అచ్చటనుండి వెడలిపోయెను. అనగా వ్యామోహము నశించెననుట.

పిమ్మట ముఖ్యప్రాణశక్తియను వాయునందనుడు ఈ వానరలతో (నాడీసమూహముతో) గూడి ముందు శృతిప్రమాణానుసరణమను పర్వతములను దెచ్చి యాసముద్రప్రవాహమును బంధించుటకు యత్నించిరి. అనాదివాసనలు అను చలనముచే, కట్టబడలేదు. పిమ్మట సత్కర్మాచరణయను పర్వతములనేకములుబడవేయు అందువలననూ కట్టబడలేదు. ఇటులెన్ని పర్యాయములు గట్టుటకు యత్నించినను గట్టబడకుండుటగని విశ్వకర్మ (విశ్వం, కరోతీతి విశ్వకర్మః= విశ్వకరణశక్తిః; చిత్‌శక్తిః. అతః విశ్వకర్మేత్యస్యచిత్తమిత్యర్థః) యనుచిత్తమునకు జనించిన దృఢవైరాగ్యమను నీలుడనువానిని రావించి శుద్ధబుద్ధియనుశక్తులిచ్చి, (నీలం=ల, రయోరభేదత్వాత్, నీరం=నీరస్యలభేద త్వాత్ ఔపచారికేణవైరాగ్యం ఇత్యర్థః నీరవన్నిర్మలఃఇతి యావత్) — ఓ నీలా? నీవు ఈచిత్తమనే సంసారసముద్రమును అరికట్టుము. అనినరామాజ్ఞను శిరసావహించెను. ఇక సాగరము కట్టుటెట్లు? అనిన హృద్వీథియందు యుండబడు ప్రాణసంచారము నాశికాగ్రమువరకు ప్రసరించును. బాహ్యాంతరశ్వా

సలను బంధించి పిమ్మట 72 డెబ్బదిరెండు వేలనాడులు ప్రాణశ
క్తియను వాయునందనునితో కలసి సేతువు కట్టుచుండిరి. అన
గా సంసారసంబంధమగు భ్రాంతితో లగుచుండెనని గ్రహించవల
ును. తదుపరి రాముడు కార్యము నెరవేరుటకై రామలింగ
స్వామిని ప్రతిష్ఠగావించిరి. అదెట్లనగా:— నేత్రములద్వారా
చూడబడు సర్వచరాచరములు తనకన్యమేమాత్రము కావని
తెలియు తెలివియే రామలింగేశ్వరుడుగా భావింపబడెను. అం
త పంసారసముద్రమునందు సంచరించు చిత్తచలనము కట్టబడె
ను. అనగా రేచకపూరక కుంభకాదులనే బాటచే చిత్తచలన
ము సంహరించబడెను.

అంతలో యీ స్థిరత్వమునుజూచి రావణుడు యోర్వలే
క విషయసుఖమనే శుకుని రామునికడకంపెను. ఈశుకుడను
(శోచతి, ఇతి=శుకః, విషయసుఖాపేక్షయా, శోకం, యాతీతి,
శుకః) చారునిజూచి ముఖ్యప్రాణశక్తి మొదలగువారు వాని
గర్వాతిరేకమడంచిరి. అందుచే జ్ఞానోదయము గలవాడై తిరి
గీ రావణునియొద్దకుజని, యోరావణా? "ఏల వృథాగాచెడియె
దవు. నీ అనిత్యత్వమును తెలియనేరక నిత్యుడగు రామునితో
బోరునకు యత్నించెదవు. అదియుంగాక అతని యోగమనుసీ
తను నీవపహరించి వానితో పోరునకు సిద్ధపడితివి. అది యుచి
తముకాదు. దేహవాసనలతో కూడుకున్న వాడవు నీవు. నిత్య
నిరుపాధికనిరాశ్రయుడగు యీరామునితో పోరుకొనుటెట్లు శ

క్యమగును? గాన యాయోగమనుసీతను అంతరాత్మయను రా మునకర్పించి నీవారామునియందు లయమొందుము." అని దృ ఢముగా బలికిన యాశుకుని వాక్యములకు చలితేంద్రియుడై యాశుకుని జంపనెత్నించె.

అందుల కోర్వలేక ఆశుకుడు అచ్చటినుండి వెడలిపోయె ను. పిమ్మట తనయందు నుండబడు దుష్టపరివారములో ము ఖ్యులను కొందరిని రావించి మంత్రిపరివారముతో కొలువుతీ ర్చి లోకవాసనాదురంధరులగు మంత్రులారా? అంతరాత్మయ గు రామునితో యుద్ధమొనరించి, యాశత్రువును సంహారింపవ లెను. ఎట్లైనను ఆకార్యమును సాధించవలెను. నాసంబంధమ గు అక్షయకుమారుడు మొదలగు మహామహులందరూ నశిం చిరి. అంతపట్టుదల మీకు ఉండునో లేదో అని భయముజెం దుచుంటిని అనిన విని యామంత్రివర్గము ఓదేవా? మీరు భ యముజెందకుడు పెద్దలచే కొనియాడబడు మంచికార్యముల న్నియు చెడగొట్టువారము. ఈకార్యముచే మేము చచ్చుట కుకూడా సిద్ధముగా యున్నాము అని ఇట్లు రావణునితో అత నియొక్క మంత్రి పరివారము దృఢముగా పలుకుచున్న సమ యములో అవధానశక్తిగల మాల్యవంతుడు ఒకడులేచి, ఓ రావణా? నీవు నీచేసిద్ధపరుపబడు సేనయు యారాము నెది రించుటకు చాలరు. యారామునిచే, చేకూర్చబడు పరివార ము చాలాసమర్ధతగలవారై యున్నారు. గావున నీవు యిట్టి

సమయమున యుద్ధముమానుకొనుట యుచితము- అని అవఘా
నశక్తియను మాల్యవంతునిచే బలుకబడిన యావాక్యముల కు
లికిపడి, యోమూర్ఖా? "నీవు నామాతులడవని యూరకుంటి
ని. నాయెదుట నిలువకబొమ్ము." అని రావణుడు బలికెను.

ఇది యిట్లుండ అచ్చట డెబ్బదిరెండు వేల వానరసేన
యు రావణునికోట ముట్టడించెను. రావణునికోటకు సప్తప్రా
కారములుకలవు. అవి యేవియనగా:__అభిమానకోపాధికుడై
న రావణునికోట సప్తధాతుమయమైన ఆవరణములతో పోల్చ
దగును. సప్తధాతువులనగా:—(శుక్లోరక్తః కృష్ణోధూమ్రః పీతః
కపిలః పాండరఇతి).అట్టి సప్తప్రాకారములను అందు ఉండబడు
అభిమానకులనే అనేకసహస్రరాక్షసులను, వానరసేన బరిమా
ర్చి యుద్ధమొనరించుచుండు సమయములో ఆవార్త యా
అహంకారుడనే రావణునకు దెలసి అతని ముఖ్యపరివారము
తో యుద్ధభూమికి వచ్చెను. ఆపరివారము లెవరనగా:— అల
సుడు, మాంద్యుడు, నాస్తికుడు, కూరుడు, క్రోధుడు, దుష్టు
డు, పరనిందాపరుడు, హింసకుడు, దేవదూరుడు, ఇంకా ఈ
మొదలగు మరికొందరు పరివారమును గూర్చుకొని ఆవాన
రసేనల నందరిని మూర్ఛగావించెను. అదిచూచి యారాము
డు ఈదుర్మార్గుని నేనిప్పుడేపోయి బరిమార్చెదనని, నిరోధ
ము, నిగ్రహము, అను ఆయుధములు చేబూని, ఆరావణసంబం
ధమయిన పరివారమును మూర్ఛగ్గావించెను. తదుపరి యా రా

షణునకు క్రోధము మిక్కుటమై, తమస్సును, కర్తృత్వమును, అను మరికొంత పరివారముతో ఆరావణుడు యుద్ధమొన రించెను.

తదనంతరం విచారణయను లక్ష్మణుడు, శబ్దతత్వమను సుగ్రీవుడు శుద్ధసత్త్వమను విభీషణుడు శమదమాదులను మరి కొంత పరివారము, వీర్లను వెంటఉంచుకొని ఆరాముడు ఆ యహంకారుడను రావణునితో యుద్ధమొనరించెను. ఇట్టి ఘో రయుద్ధము జరుగుచుండ, ఋషులను దేవతులు, శుద్ధాద్వైత మను ఇంద్రుడు, నైరాశ్యమను, కుబేరుడు సంకీర్తన చేయబడు వాక్కు అను నారదుడు యీ మొదలగు మహనీయులందరు విచ్చేసి అంబరవీధులందుండి యీ రామరావణ మహాయుద్ధ ము గాంచుచుండిరి. ఇచ్చట యీరావణుడు మరికొన్ని వా నరసేనలను నోడించెను. తదుపరి యీరావణసంబంధమగు పరి వారమును రాముడు సంహరించెను. పిమ్మట తన నాడీసమూ హమను వానరసేనలందరూ మూర్ఛనొందుటజూచి ఆ రాము డోర్వలేక జాలినొంది అయ్యో! యీ నాడీశక్తులను వానరలు ముఖ్యప్రాణశక్తియను వాయునందనునితో దుల్యులమనిచెప్పి అహమనే రావణునితో యుద్ధమొనర్చి వారలే మూర్ఛాగతు లైరి. గావున వీర్లకు ప్రాణమునుపోసి పునర్జీవితులుగా జేయ వలెను; అని నిశ్చయించి ప్రాణశక్తియను వాయునందనుని బి లపించి యోపుత్రకా! నీసంబంధమగు వ్యాపకశీలత్వమను వ్యా

నవాయువనే సంజీవిచే వీరల ఊర్ధ్వవ్యాపకవంతులను పునర్జీవి తులుగా జేయుము; అని రాముడన విని అతడట్లుగావించెను.

తిరిగీ యావానరసేనలందరూ మాయరచనయను యుద్ధభూమికివచ్చి ఆ అహమను రావణుని ఎదిరించ, అదిజూచి యారావణుడు కోపముతో తన పరివారములు చచ్చుటయు, శతృపరివారము తిరిగీ పునర్జీవితులగుటజూచి వోర్వలేక ఇట్లు చింతించెను:— ఆహా? రాముడు నాకు శతృవై అవతరించెను. ఇట్టి శతృవును నెట్లు పోకార్చెదనని యెంచి, పటపట పండ్లుకొ అకి కండ్లెఱ్ఱజేసి, మదుడు, మాత్సర్యుడు, అను పరివారముతో నేను పట్టినపట్టు విడువనని ఆయుధములతో, "అహం, అహం" అను మహాధ్వనులతో ఆయుద్ధభూమికి ఆరావణుడు వచ్చెను. అంత వారలంజూచి, విచారణయను లక్ష్మణుడున్ను, ఏకాత్మయను రాముడున్ను సంశయరాహిత్యమనే ఆయుధములతో యుద్ధమొనర్చుచుండిరి. అందులో అనాదివాసనయను ఐహిక బలము ఎక్కువగాఉండుటచే, అహమను రావణుడు విచారణయను లక్ష్మణుని మూర్ఛగావించెను. అంతే యారాముడు యుద్ధముచాలించి, నిశ్చయాత్మకమను తన ప్రదేశమున ముఖ్యప్రాణశక్తియను వాయునందనునిజేరి, యోపుత్రకా? నాసంబంధమగు విచారణయను లక్ష్మణుడు అనగా నాఅనుజుడు నిశ్చేష్టితుడయ్యెను. • నాసన్నికర్షణముచే నొనరించబడు సర్వకార్యములు నొనరంచువారలెవ్వరు? ఆహా? నేనుండియు లేవివాడనేకదా? అంటియు అంటనివాడనేకదా? అనాత్మతత్వమునుదెల

్రమునంజేర్చి సర్వము ఆత్మమయమేయని మోదించువారలెవ్వరు. ఇక ఈ యోగమనుసీత ఏల? ఈ అహంకారుడను రావణుని చంపుటేల? నేనేదియుగాక నేనుండుచోటనే ఉండువాడను. అని రాముడు (అంతరాత్మ) విచారించుసమయములో శబ్దగుణకమను సుగ్రీవుడు మొదలగువారలులేచి, యోదేవా! మీకు రూపనామాదులులేకున్నను మేము రూపనామాదులు గలవారము. కావున యీరావణునికి బలముహెచ్చిన మమ్ములనణగద్రొక్కును.

గాన నీవిచారణమను లక్ష్మణుని పునర్జీవితునిగా జేయుటకు మన ముఖ్యప్రాణశక్తియను వాయునందనుని ప్రోత్సహించవలెను. అనిన అందులకారాముడు యీవాయునందనుని వంకజూచి యోపుత్రా! నీవు వేగముగాపోయి హంసయను పర్వతమున "తత్త్వమసి" అను సంజీవిని తెచ్చి విచారణయను లక్ష్మణుని బ్రతికింపుడు, ప్రాణదానముచేయుడు. అని సుశిక్షిన, యీవాయునందనుడు వాయుమార్గమునబోవు సమయములో రావణసంబంధి ఒకడు అనగా అహంకారసంబంధమగు యొక వికారము ఆరావణునియొద్దకేగి యోరావణా! "లక్ష్మణుని జీవింపజేయుటకై వాయునందనుడు(ముఖ్యప్రాణశక్తి) వేగముగా బోవుచున్నాడు. ఒకానొక పర్వతమున సంజీవియున్నదియట. ఆసంజీవిని తెచ్చి యతనిని పునర్జీవితునిగా జేయునట." అనిన విని యీరావణుడులికిపడి కాలనేమివద్దకుజని ఈవృత్తాంత

మంతయుజెప్పి యీావాయునందనుని కొండను జేరనీయక అనే కమాయలుగావించి విషయలోలునిచేయుము. అనిన ఆమాట లువిని యీకాలనేమి యోరావణా! నేను ప్రాణమును జయిం చునంతశక్తి గలవాడనుగాను. నేనాప్రాణముచే నియమింపబ డినవాడను. నేను వానిని జంపబోయిన నేనేజత్తును.

ఇదియుంగాక, యోరావణా! నీదురహంకారమువిడచి, నశించబడు క్రోధాదులపరిపాలించే అంతరాత్మయను ఆరాము ని శరణువేడుము. ఆసీత (యోగము) నీకు జెందునదికాదు. యీారాముని కర్పింపుము. నీసంబంధమగు లంకయందుండబడు సప్తప్రాకారములను దాటివచ్చిరి. ఇక (స్వాధిష్ఠాన మణిపూ రక, అనాహత, విశుద్ధమను) కోటబురుజులను ఛేదించి జయభే రులతో (ఓం, అను ప్రణవమును) బ్రహ్మాస్త్రముతో నిన్ను ఛేదించి ఆరాముడు జయము నొందగలడు. (ప్రారబ్ధక్షయవ ర్యంతము) శుద్ధసత్త్వమను విభీషణునకు (యుక్తాయుక్తవిచక్ష ణయను) పట్టాభిషేకము గావింపగలడు. అప్పుడు నీవు చేయు నది ఏమియులేక నశించిపోదువు. అని పలికిన యీారావణుడు అలుకజెంది, ఛీ? దురాత్మా? నాకు గురువువలె బోధించెదవు. నాసంబందమగు సర్వమాయాశక్తులు గనబడుచుండ, నాకపజ యమని ఎట్లందును. ఇవి అన్నియు నశించినగాని నిష్కాముడ నేనౌటకల్ల. అని దృఢముగా బల్కి వానిని జంపయత్నించె ను. అదిజూచి వెరపుజెంది ఆరామునియందే జేరుటుచితమని

యెంచి తనకు శాసించబడిన మాయాకార్యములు కొన్ని గా వించెను.

అవి ఏవిఅనగా:— ఆధ్యాత్మికాదితాపములనే పరివారములను కల్పించుకొని మణిపూరకమను మధ్యమార్గములో నివసించెను. ఆబాటకు ఆవాయునందనుడు వచ్చుటకాంచి ఆధ్యాత్మికాదితాపములనే శిష్యులబిలచి, ఓహోశిష్యవర్గములారా? మీరలిప్పుడేబోయి, యీప్రాణసంచారమునకు వ్యాధులనే తాపములగలిగింపుడు. వానినెట్టులయిన నధోగతికిద్రిప్పుడు. అనిన యాశిష్యులట్లుగావించిరి. అందులకావాయునందనుడు రాముని యొక్క సాహాయ్యముండుటచే వారికి లోబడక కాలనియమాదులను ఆధ్యాత్మికాదితాపములను అతిక్రమించి అనగా కాలనేమి మొదలగువారలను సంహరించి (అజపాగాయత్రీ) హంసయను పర్వతమును పెకలించి పట్టితెచ్చి రామునియెదుట నుంచెను. అందు "తత్త్వమసి" అను సంజీవినిగాంచి విచారణయను లక్ష్మణుడు పునర్జీవితుడై, దేహాత్మబుద్ధియను యోరావణా? నిన్నిప్పుడే జంపువాడను, అని ధైర్యముతో యాలక్ష్మణుడు బలికిన యావాక్యములకు, యారాముడు సంతసించి అక్కునన్ జేర్చుకుని, యోకుత్రా? యాదురాత్ముడు నీయెదుట నిలువగలడా? తిరిగీ దేహవాసనలోనికి వెళ్లిపోయెను, అని బలికెను. తదుపరి ఉభయసేనాదులు యుద్ధము గావింపజొచ్చిరి.

అట్టిసమయమున యారావణుడు తనసేననంతయు మడయుట దెలసి విచారించెను. అంత తనకుమారుడగు ఇంద్రజిత్తు దేహాత్మబుద్ధి దట్టముగా గలవాడు గావున తండ్రిగారి దుఃఖము పశమింపజేయుటకై యిట్లు పలుకజొచ్చెను. తండ్రీ! నీవువిచారము పడవలదు. నాసమర్థత మీకు తెలిసియున్నదే. నేను దట్టమయిన దేహాత్మబుద్ధిగలవాడనై యిఖదాద్రిదులను సహా జయించినవాడనై దట్టమయిన దేహాత్మబుద్ధితో నుండువాడను. (జయించుట అనగా మూఢత్వము వదలకపోవుటయే). ఇట్టి బలమగు పుత్రుడు మీకుండగ, మీరేలవిచారించెదరు. ఇపుడే నేబోయి వకహోమము గావించి అందుజనించు ఆయుధముల ను బొంది రధముల నధిష్టించి (పరమార్థమను నిశ్చయబుద్ధిగల) ఆసేనలనందరిని సంహరించెదను. చలనస్వభావముగల తన రజోగుణమే ఎట్టినిపస్త్రిముగా ధరించినవాడై ఆముష్మికమగు సర్వశాస్త్రిములను తిరస్కరించి తనకు యుక్తులను స్థిరపరచునట్టి ఏదుష్టస్వభావముగలదో అట్టిదియే పాతాళలోకమనబడును. అట్టి పాతాళలోకమునకేగి తనమూఢత్వబుద్ధి బలపరచుటయను హోమము గావింపజొచ్చెను.

అందు గాఢతమమను పొగలెగయుచుండ శుద్ధసత్వప్రిధానమను విభీషణుడు, దేవా! యాధూమమును వీక్షించితిరా! యాఇంద్రిజిత్తుచే గావింపబడు హోమము పూర్తి అయినచో మరి యెట్టివారలయినను వానిని జయింపజాలరు. గాన ఈ

గుణము పొడమిన తక్షణమే తమ వానరసేనలను నియమించి హోమవిఘ్నము గావింపుడు. అనిన విని యారాముడు తన ముఖ్యప్రాణశక్తియగు వాయునందనుని విచారణశక్తియను లక్ష్మణుని బిలచి; యోబిడ్డలారా? మీరలిప్పుడేపోయి, యా ఇంద్రజిత్తుచే గావింపబడు యాపాతాళహోమమును విఘ్నము గావింపుడని పలికిన, వారలచ్చటికిబోయి అట్లుగావించిరి. తన ప్రయత్నము విఫలమగుటజూచి యాఇంద్రజిత్తు కోపాగ్నితో వీరలనందరిని నొక్కమారుగా దునుమాడెదనని నిశ్చయించి పరికరములవన్నియు సంధించుకొని యుద్ధభూమికివచ్చినిలచెను.

ఆయుగ్రమూర్తినిచూచి శుద్ధసత్వప్రధానమను విభీషణుడు ఆరామునితో నిట్లుజెప్పనారంభించెను. దేవా? వీడుద్వాదశవర్షములు నిద్రాహారాదులు వర్జించినవాడై తీవ్రవైరాగ్యముగల యేమహావ్యక్తిగలదో వానిచే యీదుష్టుడు సంహరింపబడును. గాని యితరులచే నంహరింపబడడు. ఇదియునుంగాక పంచమలములను కవచముకూడా తొడగియున్నవాడు. ఆకవచమెట్టిదనగా (1) బ్రహ్మజ్ఞానము పలుమారుపుట్టగా దానిని మరుగుపరుచునది, అణవమలము. (2) వేదాంతవిషయములను పెద్దలు బోధించునపుడు దానియందు బుద్ధినిలుపక పరాకుగానుండుటయే, కార్మికమలము. (3) వకప్పుడున్ను బ్రహ్మమున్నదను జ్ఞానము పుట్టకుండుట మాయికమలము. (4) వదా పాపకార్యములయందే యిచ్ఛగలిగియుండుట మాయా

మలము. (5) సచ్చిదానంద పరబ్రహ్మమునందు అసత్యబుద్ధిని పుట్టించి తదన్యంబులగు దేవతాంతర, మంత్రాంతర, మతాంతరములు సత్యములని బుద్ధిపుట్టించుట తిరోధానమలము నివృత్తిమార్గలములనే యెన్ని ఆయుధములచే ఛేదించినను ఆకవచము ఛేదించుట కష్టసాధ్యము. అవి ధరించు ఆమూఢబుద్ధియను ఇంద్రజిత్తు చచ్చుటకూడా కష్టసాధ్యమే. అయినను మీావిచారణశక్తియను లక్ష్మణునకు ఈకార్యము నియమింపుడు-వానిచే సాధించబడును అని శుద్ధసత్వప్రధానమగు విభీషణుడు పలికిన విని ఆరాముడు తనవిచారణశక్తియను లక్ష్మణునితో యాదురాత్ముడగు ఇంద్రజిత్తుని సంహారింపుమని కార్యము నియమించెను.

అందులకాలక్ష్మణుడు, అఖండాద్వితీయుడగు ఆరాముడ నేనేనను నమస్కారాదికృత్యములు గావించి తన పరికరములతో బయలువెడలెను. ఆయుద్ధభూమియందు నిలువంబడిన యామూర్ఖునితో (ఇంద్రజిత్తుతో) యుద్ధముగావింపజొచ్చెను. నేతినేతియను వాక్యములనే ఆయుధములను ప్రయోగించెను. అందులకామూర్ఖుడు లొంగక (దారేషణాదులనే) ఆయుధములచే వానినన్నింటిని సంహారించెను. అదిచూచి విచారణయను లక్ష్మణుడు పరతత్త్వనిష్కర్షయను ఆయుధములు ప్రయోగించెను. తిరుగా ఇంద్రజిత్తు ఐహికభోగమే నిశ్చయమను బాణముచే వానిని ఖండించెన సగ విచారణయను లక్ష్మణుడు

శ్లో॥ "సామ్యేద మగ్రిఆసీత్." అను బాణము వేయ, "అహం మూఢః అహంకించిద్జ్ఞడ, అహంజీవః," అను బాణములచే ఆ మూర్ఖుడు వానిని బరిమార్చెను. పిమ్మట యాలక్ష్మణుడు పంచమలములను కవచమును ఛేదింపజొచ్చెను. అట్లు ఛేదించి యా మూఢత్వమను ఇంద్రజిత్తుని నిధిధ్యాసయను ఆయుధముచే సంహారించెను. అంత మూఢబుద్ధియను ఇంద్రజిత్తు సంహారింపబడుటవిని, అహమను రావణుడు ఆహా! కుమారా! మడసితివా! అని శోకాబ్ధిని మునిగి మూర్ఛగతుడాయెను. అంత కొంతవడి విలపించుచుండు సమయమున కొందరుపోయి కుంభశ్రవణములు గల కుంభకర్ణుని దోడ్కొనివచ్చి అన్నయెదుట నిలువబెట్టిరి.

అతడు యాఅన్ననుజూచి యోసోదరా? నీవు విలపింపకుము. మూఢబుద్ధియను ఇంద్రజిత్తు నశించినను, వినిన యన్నిటిని మరచుటయను స్వభావముగల నేనుంటినిగదా? నీ ఐహిక సంబంధమగు రాజ్యముకు ప్రమాదంలేదు అని నుడివి ఆ కుంభకర్ణుడు యుద్ధభూమికి జని యుద్ధముగావింప జొచ్చెను. ఆయుద్ధమెట్టిదనగా:—ఏకముఖముగా నుండబడు డెబ్బదిరెండువేల నాడీసమూహమను వానరులనందరిని చలింపజేయుటయు ఊర్ధ్వగతిగా దిప్పబడు ప్రాణగతులను అధోగతిగా దిప్పుటయు యోగమునకు సరిపడు ఆసనాదుల చలింపజేయుటయు యా

మొదలగు అనేకవిఘ్నములు గావించెను. ఈసంగతి ఆరాము డు దెలుసుకొని ఆత్మానాత్మ వివేకమనే ఆగ్నేయాస్త్రముచే ఆకుంభకర్ణుని సంహరించెను. పిమ్మట యింద్రియాధిష్టాతలనే దేవతలందరూ ఆనందభాష్పమనే పుష్పవర్షము కురిపించిరి. అప్పుడు ఆత్మానంద మనుభవించి యీ రామునివంక జూచి యోసాక్షాత్స్వరూపమా? అసాధ్యమగు జీవేశ్వరైక్యమను సుఖమునకు వచ్చేడు అడ్డులు అనే అనేకసహస్రరాక్షసులను సంహరించిరి; అయినను సంతతసమాధి నొందుటకు ఈఅహామ నే రావణునికూడా సంహరించిన అసిధారావ్రతంబగు సమా ధిసుఖము నొందగలము. అని దేవతలు ఈ మొదలగు స్తోత్ర ములు జేయుచుండిరి. పిమ్మట అనాదినుండి తన్ను వెంబడించు దుర్విషయములనే రాక్షసులతో రావణుడు కొలువుతీర్చి వార లతో యిట్లుబలికెను. యో మంత్రివర్గములారా? నానంబంధ మగు పరివారములందరూ క్రమముగా నశించిరి. అందులో ముఖ్యుడు ఇంద్రజిత్తు నశించెను. ఎంతగొప్పవిషయములు విని నను లక్ష్యముచేయక మత్తుగానుండబడు కుంభకర్ణుడుకూడా నశించెను.

ఇక నేనేమిచేయువాడనని చింతించు సమయములో వి ష్ణుభక్తియను శుక్రాచార్యులు అచటికివచ్చి యీరావణునిజూ చెను. యీఅహామనే రావణుడు వానిని దర్శించి అనేకబా హ్యాడంబరములనే పూజలు గావించెను. అందుకతడు సంతసిం

చి, యోబిడ్డా? యేలవిచారించుచుంటివని బలికిన యారావ
ణుడు, యోదేవా!—సృష్టిమొదలుకుని నేటివరకు నాచేనార్జిం
పబడు విషయములన్నియు జ్ఞానమనే రాముడు తత్సంబంధమ
గు పరివారములు సమీపించుటచే నాసంబంధమగు దుష్టపరి
వారమంతయు నశించెను. అందుచేత నేనేమియు చేయలేనివా
డనై బలహీనముగ్గా నుంటిని. అని నుడివిన, ఆభక్తియను శు
క్రాచార్యులు యోరావణా! నీవు విచారించకుము. ఇంకొక
యుపాయముగలదు- అది సావధానముగ విని ఆచరించిన మె
డల సర్వసుఖములు చేకూరును. అది యెట్టిదనగా:— ఆము
ష్మికమునకు స్థాపింపబడు సర్వశాస్త్రములు తిరస్కరించుటయే
పాతాళహోమము. అట్టిహోమమును గావించుటకు జితేంద్రి
యుడవై చలించనివాడవై పాతాళలోకమున ప్రవేశించి పు
ణ్యవాసనలనే వానరులుగాని పాపవాసనలనే రాక్షసులుగాని
చలింపకుండునట్లు (అపానమునందు ప్రాణమును ప్రాణమునం
దు అపానమును) హోమము గావించుచుండుము. అందుల నీ
కు గొప్పజయము గలుగును.

అట్లు ఆచార్యులవారుచెప్పినదివిని సంతసించి ఆహోమ
ము ప్రారంభించెను. ఆసమయమున శుద్ధసత్వమను విభీషణుడు
ఆసంగతి విని గ్రహించి రామునియొద్దకుజని అంతరాత్మయగు
రామునితో ఇట్లుబలికెను.

యోదేవా? యాతమస్సంబంధమగు ధూమమును వీ
క్షించితిరా? రావణునిచే పాతాళలోకమున పాతాళహోమ

ము గావింపబడుచున్నది. ఆహోమము పూర్తిఅయిన మూఢత్వమధికమగును యిదివర్గో నేనేజీవుడను, నేనే దేహమును నేనేమాయకుడను, నేనే అవిద్యను, యీ మొదలగు ప్రవృత్తుల తో సంచరించెను. ఇప్పుడు యీపాతాళహోమము పూర్తిఅయినతోడనే, నేనే బ్రహ్మమును నేనే ఆత్మను, నేనే కేవలాత్మను, నేనే పరమాత్మను, అను యుక్తులతో యెట్టి పండితులనైనను తిరస్కరించు అచలభానమొకటి పొడమును. అప్పుడతనిని, యనగా యీరావణుని జయించుట చాలకష్టము. తాపట్టిన కుందేటికి మూడేకాళ్లని వాదించగలడు. మానములు, త్రివిధములు, కాష్టమానము, వాఙ్మానము, మనోమానము, వీనినన్నిటిలో మనోమానము శ్రేష్ఠము. సర్వసంశములు తొలగినంగాని మనోమానము గలుగుట దుర్లభము. అట్టి మనోమానము నొంది స్వప్రకాశుడై తనయందుతానే రమించుచుండును.

అట్టి యున్నతస్థితి రాకుండుటకై వచ్చుఆటంకము లివి యని తమరు యోజించి తమసంబంధమగు డెబ్బదిరెండువేల నాడీసమూహమను వానరులపురిగొల్పి యీడాంబికతపమును విఘ్నముగావింపుడు అని విభీషణుడు బలుకగా యీరాముడు అట్లు గావించుమని యీవానరసమూహముతో జెప్పెను. అందుపైని వారలచటకేగి నలుగడలపరిశోధించు సమయములో, సూచనయను సరమాదేవి యీస్థలము చూపింపజేసెను. యీ స్థలమునకు వీరందరుజని, వివేకములేక మోహితుడై సర్వము

తనవశమైయుండవలెనను మూఢభావముతో తానేఅన్నిటికివశమై యుండుటుచితమని యెంచక ఆహామను యారావణునిచే వేల్చబడు హోమము విఘ్నముగావింపజొచ్చిరి. కామ్యపరత హెచ్చుగానుండుటచే, ఆతను (రావణుడు)యేమాత్రము చలించుట లేదు. అందుకు దృశ్యాభిమానమను మండోదరిని పెకల్చి ఎదుట నిలువబెట్టిరి. (అనగా రావణుని దృశ్యాభిముఖునిగా జేసిరి). అది, దృశ్యమంతయు మిథ్యఅయినదికదాయని దెలసి, దృక్కు-అయిన ఆత్మయందు జేరుట నాగతియని విచారించుచున్న సమయములో అహమనే రావణుడు తనఅభిమానమగు మండోదర ట్లు విలపించుచుండ తానుచేయునది ఏమియులేక యామండోదరిని తన యక్కున జేర్చుకుని యోమగువా! మనసంబంధమగు పరివారమంతయు నశించెనని విలపింపకుము. ఎన్ని పర్యాయములు నశించిన అన్ని పర్యాయములు పుట్టగలవు. ఇప్పుడు నశించునట్లున్నను ఇంకొక కాలమునందు చలించుచునేయుండును. కావున వీనిని మనము యెంతమాత్రము నమ్మవద్దు. నిత్యుడైనఆ రామునియందు మనమిరువురము లయించిన సుఖముగా నుండెదము. ఎంతవరకు పరువు లిడగలమో అంతవరకు పరుగిడెదము. అటుపైని స్థలములేనిచో మనమెట్లు పరువెత్తగలము. గావున ఇదియు, ఇదియు, అని సర్వము చూపించి, యేదియు నంటకుండానుండు అఖండాద్వితీయ శుద్ధాత్మయను యారామునియందే గలయుట శ్రేష్ఠమని పలికెను.

అంతకన్న వేరుగాని దృశ్యమను మండోదరియు అహమనే రావణునియొక్క వాక్యములకు ఒప్పుకుని ఊరకుండెను. అనాదీవాసనలనే మంత్రిపరివార మచటికివిచ్చేసి అహమనే రావణునియొక్క తూష్ణీంస్థితినిగాంచి వానితోయిట్లు బలికెను. దేవా! మీరు అఖండాద్వితీయుడగు యీరాముడే మీరగునంత వరకు యుద్ధముచాలించుట వుచితముగాదు. మాసంబంధమగు శక్తులు కొన్ని నశించినను కొందరముంటిమి, గాన మేమందరముగూడి యీరాముని జయించుటకు సన్నద్ధులమై వెడలవలెను అని దృఢముగాబల్కిన యీమంత్రిపరివారమున్న యీ రావణుడున్ను యుద్ధభూమికి సమీపించిరి. పిమ్మట మమత్వమనే రథమున అహమనే రావణుడధిష్టించి అఖండాద్వితీయుడగు ఆత్మారానిముతో యుద్ధము ప్రారంభించెను, యీయుద్ధమెట్టిదనగా:—లేనిదానిని యున్నదని వాదించువాడు రావణుడు. ఉన్నదివున్నట్లుగానే తెలసి ఆమోదించువాడు రాముడు. యీ రావణుడు చలితేంద్రియుడై వాచారంభణమగు అనేకభేరీధ్వనులు మ్రోగించి, ఓ రామా! నీచే పరిపాలించబడు దృశ్యమాన ప్రపంచకమంతయు మిధ్యయని పదేపదే వాదించుచుంటివి. ఓ దురాత్మా! నాచే వేయబడు బాణమును కాచుకొనుము అని లోకవాసనలను జూపుచున్నాడు.

ద్వైతమే సత్యమను శృతితాత్పర్యము:—సకలపురుషార్థములకు అనుకూలంబయిన శరీరమును పోషించుటకు భార్య

కంటె యితరు లెవ్వరు సమర్థులుకారనియు మిక్కిలి నొక్కి వ క్కాణించి యున్నది కాన ఇల్లాలే ఆత్మయగును. అది గ్రహించి, అద్వితీయుడగు రాముడు, ఎన్నిబోధలు బోధించినను నీవు (అహంకారుడవు) చావకుంటివి గాన కొన్ని శృతిప్రమాణములనే ఆయుధములచే రుజువుపరచి నిన్ను సంహరింతును అని నిశ్చయించి, తన నాడీశక్తులగు వానరులు, తానుగలసి ఏకముఖులయి చిణి, చిణి, నాదములను భేరీ, మృదంగ, ఢంకా వేణు, ఘంటానాదములనేకములుగా మ్రోగింపజేయుచు, "ఓం," "ఓం," అను జయ, జయధ్వనులతో ఇడ, పింగళ, సుషుమ్నయను జండాలనెత్తి అనాహతచక్రముద్వారా కుండలినీశక్తిని ప్రవేశించి అహమను రావణుని ఊర్ధ్వదృష్టిని దిప్పుట యను యుద్ధము ప్రారంభించి యోమూర్ఖా? నీవు వేయుబాణములకు ప్రతిబాణము వేయుచుంటిని. గాచుకొనుము. అని రావణునితో బలికెను.

## అద్వైతశృతులు.

1. శృ॥ అద్వైతంపరమార్థోహి, ద్వైతంతద్భేదఉచ్యతే। తేషాంఉభయథాద్వైతం తేనాయంనవిరుధ్యతే. అర్థము. అద్వైతమే పరమార్థము. నానాత్మరూపమగు ద్వైతము, ఆ అద్వైతముయొక్క భేదము అనగా అద్వైతముయొక్క కార్యమని భావము. (మాం. ఉ॥ గా॥ వా॥ 18)

2. శృ॥ ఏకమేవా ద్వితీయం- (ఛాం- ఉ॥ అ- 7-1)

3. శృ॥ నతు తద్వితీయమస్తి (బృ- ఉ॥ అ 4- 3-23)

తా॥ తత్పదార్థమైన బ్రహ్మస్వరూపమునకు రెండవది లేదు, అనువాక్యములనే రామబాణములకు రావణుడు ఏమాత్రము చలించక తనునమ్మిన ఈషనాదుల్లలో చిక్కువడి తను నమ్మినధనమే యాత్మయని అందులకు శృతులనుగూడా జూపుచూ (అమూర్ఖుడు) ఆరావణుడు వెరపుజెందక దేహాత్మబుద్ధి యను బాణము రామునియందే వేయనెంచి, బాణముసంధించి, రామునివంకజూచి, యోరామా? నీవికారరహిత వాక్యములు నాయందేమాత్రము పనిచేయజాలవు అని బాణము వేయుచున్నాడు:—

శృ॥ సవాఏషపురుషోన్న రసమయః:— అట్టి దేహాత్మబుద్ధియను బాణప్రయోగమునకు ఆయాత్మారాముడు అద్వైతమే నిశ్చయమను శృతిబాణములను ప్రయోగించెను.

శృ॥ ద్వితీయాద్వైభయంభవతి. (బృ॥ ఉ॥ 1-4-2)
తా॥ రెండు వస్తువులుంటే భయము గలుగుతుంది.

శృ॥ ఉదరమంతరంకురుతే। అథతస్యభయంభవతి (తై॥ ఉ॥ 8॥ తా॥ యథార్థతత్వమందు స్వల్పభేదమైనను జేసిన భయముగలుగును.

శ్రు॥ ఇదంసర్వంయదయమాత్మా— (బృ॥ ఉ॥ 4-45)
తా॥ ఈసర్వమున్నూ ఆత్మయే.

శ్రు॥ మృత్యోస్సమృత్యుమాప్నోతి, యఇహనానేవపశ్య తి. (కఠో॥ ఉ॥ 2=10) తా॥ యవడు నానాత్వముఃజూచుచు న్నాడో వాడు మృత్యువునుంచి మృత్యువును పొందుచున్నాడు అనగా జన్మపరంపరలు పొందుచున్నాడు.

వ॥ అధ్యాత్మ అధిదైవికములగురించి తేజోమయుడు న్ను, అమృతమయుడున్ను, పురుషుడున్ను పృథివ్యాద్యంతర్గ తుడగు ఏవిజ్ఞాతగలడో అతడే పరబ్రహ్మము. ఆపరబ్రహ్మమే సర్వమని రెంటికిని ద్వైతక్షయానంతరం బ్రహ్మత్వము ప్రకా శితమయినది.

శ్రు॥ అవిభాగేనదృష్టత్వాత్ - బ్రహ్మసూత్రము.

తా॥ బ్రహ్మమునుంచి జీవుడు విభాగుడుగాడు. అనగా బ్రహ్మము ఏకత్వప్రతిపాదకుడు.

వ॥ వికారమయిన సగుణమున్ను, నిర్వికారమైన నిర్గు ణమున్ను రెండుపంథలు శృతిచేచెప్పబడుచున్నది. వికారజాత మంతయు ఆపదతత్త్వముయొక్క విస్తారము. ఆవికారముకం టె ఆవల యథార్థముగా నిర్వికారుడే యున్నాడు. వాడే ని ర్గుణుడు.

శ్లో॥ యత్రలోకా, నలోకాః; దేవా, నదేవాః; వేదా నవేదాః; యజ్ఞా, నయజ్ఞాః; మాతా, నమాతా; పితా, నపితాః; చండాలో, నచండాలః; తాపసో, నతాపసః; యేకమేవతత్పరం బ్రహ్మ, విభాతినిర్వాణం —

శ్లో॥ మనోదృశ్యమిదంద్వైతం, యత్కించిత్సచరాచరం మనసో హ్యామనీభావే ద్వైతంనైవోపలభ్యతే॥

యానిర్ణయములనే బాణములకతడోర్వలేక తిరిగీ వాటినన్నిటిని ఖండించుబాణములు వేయుచుండెను.

శ్లో॥ అన్యోన్యరాత్మాపాణమయః- పాణమేబ్రహ్మ మనియు-

శ్లో॥ అన్యోన్యరాత్మామనోమయః అన్యోద్యైనపరమాత్మమనోమయుడే॥

శ్లో॥ మనసాకల్పితంసర్వం। మనసాపరిపాలితం। మనసా సంస్కృతం, తస్మాత్ మనయేవాస్తికారణం॥

ఛీ. మూర్ఖా నిన్నెంతచంపినను చావకుంటివి. ఈతూరి కాచుకొనుము. అని యింకొకశ్రుతియను బాణమును వేయుచుండెను.

ఉదారస్వభావముగల పెద్దలనే దేవతలు యీఆత్మయనే రామునకున్ను, అహమనే రావణునకున్ను జర్గుచున్న యుద్ధముజూచి యోర్వలేక రావణుడు చావకుండుటకు వగజెంది ఇంద్రునితో విన్నవింప సత్కర్మాచరణమనే ఇంద్రుడు జితేంద్రియత్వమనే రథమును గొనితెచ్చి అఖండాద్వితీయుడగు రామునిపద్దనిడి, యోమహాత్మా? నీవు నిర్వికారుడవు. ఈఅహమనే రావణునిచే మేముపడు శ్రమలు యోర్వలేక తమకు విన్నవించితిమి. మమ్ములనుద్ధరించుటకై ఈదురాత్ముని సంహరింపవలసివచ్చెను. మీరేమియు నంటిసంటనివారే. అయినను అహమనే రావణుని సంహరించునంతవరకు ఈజితేంద్రియత్వమను రథమునందు అధిష్టించి ఈతులువను సంహరింపవలయునని ప్రార్థించిన యీఆత్మారాముడు అట్లు యీరథమధిష్టించి యీమూఢాత్మయగు రావణునినంకజూచి యోమిథ్యావాదమా? ఇంకను తాపట్టినకుందేటికి మూడేకాళ్లని వాదించుచుంటివా? రజ్జువునందు ఆరోపింపబడు సర్పమెట్ల సత్యమో అట్లుగానే నీచేనమ్మబడు జగత్తుయొక్క సత్యత్వమని నమ్మము. అయినను నీమమత మాపనెంచి ఇవే తూపులను ప్రయోగింతును. ఎదురుకొనగలవే? అని యీక్రిందిబాణములను ప్రయోగించెను.

రామబాణములు.

1. మృగతృష్ణాజలంపీత్వా తృప్తశ్చేద స్త్విదంజగత్। నరశృంగేణనష్టశ్చేత్త శ్చిద స్త్విదమేవహి। గంధర్వనగరే సత్యే జగద్భవతిసర్వదా॥

2. గగనే నీలిమా సత్యేజగత్సత్యం భవిష్యతి। శుక్తికా రజితంసత్యం। భూషణంచ్చేజగద్భవేత్॥

3. చిత్రిస్థదీప్తిస్థమసో, నాశశ్చేదస్మ్యేదంజగత్। మాసాత్పూర్వం మృతోమర్త్యోహ్యాగతశ్చేద్భవేజ్జగత్॥

4. మసికేన హతేసింహే జగత్సత్యం తదాస్తుతే। స్వప్నదృష్టంచ యద్వస్తు జాగరేచేజ్జగద్భవేత్॥

5. దరిద్రోధనికానాంచ। సుఖంజానాతిచేజ్జగత్। శునాపీర్యేణసింహస్తు జితోయదిజగత్తదా॥

అని ఇట్టిబాణములచేనైనను ఆ అహమనే రావణుడు చావక యీరాముని వంకజూచి మోదురాత్మా? నాచే పరిపాలించబడు వారిని త్రోసినంతమాత్రమున, నేనుజచ్చువాడనుగాను. నేను సమ్మిన జగమంతయు మాటిమాటికి కాదని చెప్పకుము. నేత్రములులేనిది చూచుటయెట్లు? కర్ణములులేనిది వినుటయెట్లు? నాశికలేనిది వాసనచూచుటఎట్లు? జిహ్వాలేనిది రుచి చూచుటయెట్లు? త్వక్కులేనిది స్పర్శించుటయెట్లు, హస్తములేనిది ఇచ్చిపుచ్చుకొనుటెట్లు? పాదములులేనిది గమనాగమనములు యెట్లు? ఇట్లుగానే సర్వేంద్రియములు నాపరిపాలనాశక్తులయియుండ, యివి మిథ్యయని కడకు ద్రోయుటెట్లగును? అని దృఢముగాబల్కు రావణునిజూచి నిరోధమను ఆగ్నేయాస్త్రి

ము ఆరాముడు వేసెను. అందులకు అహమనే రావణుడు చ పలత్వమనే వారుణాస్త్రము వేసెను.

అందులకారాముడు మహావాక్యబోధమను సర్వబాణ మును వేసెను. అందులకాఅహమను రావణుడు అవివేకపరత యను గారుడాస్త్రమును వేసెను. "అహంబ్రహ్మా" అని రా ముడున్ను, "అహందేహి" అని రావణుడున్ను, అహంసర్వజ్ఞః అని రాముడున్ను, అహంకించిత్ జ్ఞః అని రావణుడున్ను, ఇట్లు ఘోరయుద్ధము యిరువురున్ను చేయుచుండిరి. సత్కర్మపరిపా కమను ఇంద్రుడున్ను, శుద్ధసత్వప్రధానమను విభీషణుడున్ను, ఇంద్రియాధిష్టాతలయ్ను దేవతలున్నూ, చేష్టారహితులై యుం డిరి. అందులో శుద్ధసత్వప్రధానమను విభీషణుడులేచి రాముని వద్దకుజని, యోదేవా! ఈదురాత్మ్ముని తమరెన్ని విధములచే సంహారించినను సంహారింపబడుటలేదు. యీదురాత్ముడు స్వప్రాప్తా దియందు తమచేనియమింపబడు అహమనే శుద్ధవాక్యబోధము ను అమృతముగా ధరించినాడు.

అట్టి కుండికను భేదించిన్గాని యీరావణుడు చావడు. కాన ముందు కుంశికను భేదింపుడు. అని నుడివిన ఆరాముడు సుషుమ్నాంతర్గతముగా కుంభకప్రాణాయామముచే శోషింప జేసి పిమ్మట దశవిధప్రాణములనే దశశిరస్సులను భేదింపజొచ్చె ను. ఎన్నిసారులుభేదించినను, నాశికకర్ణములద్వారా అవి తిరిగి

తిరిగి పుట్టుచునేయున్నవి. ఎన్ని పర్యాయములు కొట్టిన అన్ని పర్యాయములు జనించుచునేయుండెను. అందులకారాముడు విసుగుజెంది దృగ్దృశ్యరహితమగు పూర్ణత్వమను బ్రహ్మాస్త్రము ప్రయోగించి మధ్యశిరస్సును ఖండించెను. అనగా వ్యాపకశీలత్వమగు వ్యానవాయువును ఉపశాంతినొందించెను. క్రమముగా దశశిరస్సులను పడవేసెను. అణువైనన్ను శేషింపకపోవుటచే అహమనే రావణుడుజచ్చి అఖండాద్వితీయశుద్ధచైతన్యమనే రాముని యందు లయించి పూర్ణసమాధిపరుడై సుఖించెను. ఈఅహమనే రావణుడు చచ్చుటగని శుద్ధసత్వప్రధానమను విభీషణుడు యింకా దేవతలందరూ ఆత్మానందముబొంది రాముడుదక్క అన్యమేమాత్రమునులేదని సుఖులయియుండిరి.

పిమ్మట ఆంతరముఖత్వమను పుష్పవర్షము దేవతలు గురిపించిరి. తదుపరి త్రిగుణములకు అధిష్ఠాతయగు అహంకర్తయగు రావణుడు చచ్చి రామతేజమై నిలచెనుగదాయని విభీషణుడుపోల్చి, కించిత్ విచారసూచనతో యూరకుండెను. అదిచూచి రామునియాజ్ఞచొప్పున విచారణయను లక్ష్మణుడు శుద్ధసత్వమను విభీషణునిజూచి, ఓవిభీషణా! "నీవు ప్రారబ్ధక్షయపర్యంతము యుక్తాయుక్తవిచక్షణమను రాజ్యపరిపాలనము చేయుచుండుము." అని నుడివినపయిని, అందుకియ్యకొని విభీషణుడు రామాజ్ఞప్రకారం పరిపాలనజేయుచుండెను. తదుపరి రావణవిషయమైన సాక్షాత్కారమను ఉత్తరక్రియలుచేసెను. పి

మ్మాట ఆరాముడు వాయునందనునిబిలచి, నీవు విభీషణుని అను జ్ఞచొప్పున అశోకావనికయందు ప్రవేశించి, యూఆనందయోగమను సీతనుగాంచి రావణసంహారమైనదనియు, వానిపరివారము కూడా నిర్మూలముగా నశించినదనియుదెల్పి ఆమెనుమాయెదుటకు దోడ్కొనిరమ్మని యాజ్ఞాపించెను. అతడు అందుకు శిరసావహించి, రావణాంతఃపురమున ప్రవేశించి విభీషణునిగాంచి యోవిభీషణా? రామునియొక్క యానందయోగమను సీతనుతెచ్చుటకై యూరాముడు నియమించెను. నీవు శుద్ధసత్వప్రధానమగుటచే తోడుపడగలవు. అని వాక్రుచ్చెను. అందులకియ్యకొని, ఆవిభీషణుడు వాయునందనునితో గలసి అశోకావనమునన్ జొచ్చి ఆయానందస్వరూపిణినిగాంచి సర్వముని వేదించి నేతినేతి యను మహావాక్యములను అలంకరించి హంసస్సోహమ్మను శిబికయందు నారోహించి మెల్లన రామసన్నిధికి దోడ్కొనివచ్చెను. యూసీతనుగాంచి యూఆనందయోగమను సీతకున్ను తనకున్ను యేమాత్రము భేదములేదని తెలసి నీటియందు ద్రవశక్తి అగ్నియందు ఉష్ణశక్తి వాయువునందు చలనశక్తి ఎట్లుగా భేదములుగాంచలేమో, అట్లుగానే అద్వితీయుడగు రామునకు అతని సహచారిణియగు సీతకున్ను భేదమేమాత్రములేదని తెలసి

శ్లో॥ లోకసంగ్రహమేవాపి- భగవద్గీత. అనునట్లు తపస్సు, ధ్యానయోగాదులను, అగ్నిని ప్రజ్వాలింపజేసి ఆయగ్నియందు తన మాయాసీతను ప్రవేశింపజేసెను. అందులకు తనయుత్తమ

శక్తులగు దేవతలందరూ . రామాజ్ఞకు వేరువారుకాకపోవుటచే అందే లీనమొందిరి. పిమ్మట ఆసీతయు ఆఅగ్ని హోత్రుడును రాముఁడే తమకు శరణాగతుడని యుండిరి. అందరు సంపూర్ణానందమయులై నైరాశ్యమను కుబేరునియొక్క పుష్పకారోహణమొందిరి అందరూ యేకముఖులయి తటస్థలక్షణయను అయోధ్యకు రానెంచి మధ్యమార్గములో రూపించినవన్నియు తన సంకల్పజాలములనియెంచి తనయందే లయమునొందించుచు తన సహచారిణియగు సీతకు ఇట్టి పూర్ణశక్తులన్నియు జూపుచు క్రమముగా నన్నియుగడచి, తన తటస్థలక్షణయను అయోధ్యకు జేరెను. అచ్చట కౌసల్య, కైక, సుమిత్ర, వశిష్టుండు ముదలగు పరివారమందరినిజేరి, తల్లులవంకజూచి యోతల్లులారా? నన్ను మీరుకనుటచే మీమహిమవల్ల యాదుష్టుడగు రావణుని సంహరించితిని. అతని పరివారము అతనితో నశించెను.

అచ్చటనుండి శిష్టాచారమను వశిష్టునిగాంచి, యోదేవా? తమ నీతికోవిదత్వసాహాయ్యముచే దుష్టపరివారమందరినీ సంహరించితిని. అని నడుమసమయములో భరతుడటకు యేతెంచి, యోదేవా? తమ సంబంధమగు రాజ్యభారము యింతదనుక భరించితిని. ఇప్పుడు తనకన్యమగు వస్తువేమాత్రము లేకపోవుటచే "సర్వంఖల్విదంబ్రహ్మ" అనునట్లు తమకేమాత్రము వేరులేదని తెలిసి నేనుకూడా తమరేయని నిలచియుంటిని. నాభార మేమాత్రములేదని యూరకుండెను. ఇతరపరివారము,

కూడా అట్లేయుండెను. తనకన్యమేమాత్రములేదని తెలసి రాముడు తనయందుతానే రమించుటయను పట్టముకట్టుకొనెను. దేహవాదసును భ్రమ నిర్మూలము నొందించుటే కానుక గా నందరికి సమర్పించెను. అయోధ్య తన పరికరముగా పరిపాలించుచుండెను.

ఓం, తత్, సత్.

గద్య:—ఇతిశ్రీమత్ కూరెళ్లవంశక్షీర పయోధిసము
ద్భారక శ్రీనృశింహాభిధాన రూప నారాయణ
చరణ సేవాపరాయణ శ్రీ కామేశ్వరీ
లక్ష్మిదేవీ రచితాంతరార్థ రా
మాయణ రూప బ్రహ్మ
విద్యయందు
షష్టమ
సాధనమను యుద్ధకాండము
సమాప్తము.



S. S. M. PRESS, VIZAG.

